# పలనాటి భారతము

(ఉపవాచకము)

**Non-Detailed Text for S. S. L. C. Examination,**
**March 1954**

రచయిత :
యన్. యస్. వి. సోమయాజులు.

కళ్యాణీ పబ్లిషర్సు

బకింగ్‌హాంపేట : : విజయవాడ-2.

# PALANATI BHARATAMU



*Author :*

N. S. V. SOMAYAJULU,

(Telugu Vidwan, Sahityaratna, Hindi Vidwan)



**KALYANI PUBLISHERS**

**VIJAYAWADA-2.**



[*Price Re. 0-14-0*

1953



*Approved by the T. B. C. Madras for Non detailed Study.*
*Vide page 130 Suppt. to part 1 B of Ft. St. George*
*Gazette dated 22nd May 1951.*



PRINTED AT
THE WELDUN PRESS,
MADRAS-21.

# ఆముఖము

కవిసార్వభౌముఁడైన శ్రీనాథుని 'పల్నాటి వీరచరిత్రము'ను జదువుట తటస్థించినది. పలనాటివీరుల యవక్రపరాక్రమగాథ రక్తము నుడుకెత్తించినది. పౌరుషము పెల్లుబికినది. నాటి తెలుఁగుల సంస్కృతి, రాజనీతిజ్ఞత, ఔదార్యము, ధార్మికప్రవృత్తియు గన్నులయెదుట సాక్షాత్కరించినవి. నాలోని యాంధ్రత్వము పైకుబికినది. కొంతకాల మాలోచించినాను.

నాగమ్మ కుట్రలును, బ్రహ్మనాయని యోర్పును, బాలచంద్రుని పరాక్రమమును, అలరాజు రాయబారదక్షతయు, కన్నమదాసు పౌరుషమును చిత్రించునట్టి యీ కావ్యవిషయము మహాభారతమును జ్ఞప్తి కెలయించినది. దేశాభిమానమును, ఆత్మగౌరవమును, స్వాతంత్ర్యేచ్ఛను, ఆంధ్రసంస్కృతిని, ఆంధ్రుల సంఘసేవాపరాయణత్వమును, ధార్మిక రాజనీతులను బ్రదర్శించునట్టి యీ కావ్యవస్తువు విద్యార్థుల కత్యంతోపయుక్తమని యెంచినాను. హిందూధర్మమున కాటపట్టయి పంచమవేద మనఁబరగిన మహాభారతమున కాంధ్రజాతీయ ధర్మోపదేశకమగు నీ 'పలనాటి భారతము' తీసిపోదని నిశ్చయించుకొని బాలుర కర్థమగు రీతిని గద్యమున రచింప మొదలిడితిని.

నా యాలోచన యీ రూపము దాల్చినది. ఈ చిన్ని పొత్తమును సహృదయులగు పాఠకుల చేతియందుంచినాను. వారి హృదయము నీ పొత్త మేమాత్రమైన నాకర్షింపఁ జాలినచో నా శ్రమ సఫలము. రసస్వరూపులగు సహృదయు లిద్దానిని సమాదరింతురుగాక యని ప్రార్థన.

—రచయిత

# విషయసూచిక

# పలనాటి భారతము

## ఉపక్రమణిక

అది పండ్రెండవ శతాబ్దము. ఉత్తర భారతమున జంభనాపుర మను నామాంతరమున నొప్పు బాలమాంచాల పురమును 'అలుగురాజు' పరిపాలించుచుండెను. అతఁడు కార్తవీర్యార్జునుని సంతతివాఁడు. కార్తవీర్యార్జునున కేడవ తరమువాఁడు. ప్రజానురంజకముగ, రాజ్యపాలన మొనర్చుటం జేసి చక్కని కీర్తిప్రతిష్ఠల నార్జించినవాఁడు. కాని యాతని యన్వయమునకు మూలపురుషుఁడగు కార్తవీర్యార్జునుని పాపములు వీనినిగూడ బాధించుటంజేసి నిరంతర దుఃఖ మగ్నుఁడై యాతఁడు తత్పాపపరిహారోపాయముల నన్వేషించుచుండెను. అందులకై యాతఁ డనేక దేవతలకు మ్రొక్కెను. వ్రతముల నాచరించెను. కాని, ప్రయోజనము లేకపోయెను.

ఇట్లుండ నొకనాఁ డొకపండితుఁ డాతనియొద్ద కేతెంచి యీ యుదంతము విని "రాజా! నీవు జీడినూనెగుడ్డల ధరించి నిజరాజ్యము వీడిపోవలెను. నీ సంపత్తిని, పరివారమును వెంటఁగొని దివ్యక్షేత్రంబుల దర్శించుచుఁ, బుణ్య

తీర్థముల మునుంగుచు నాయా క్షేత్రములందు నీవు దర్శించు నట్టి మహానుభావులం బూజించుచు దేశాటనము సలుపవలెను. అట్లు పుణ్యతీర్థములం గ్రుంకులిడుచుండ నీ వస్త్రము లేనాఁడు తెల్లబడునో యానాఁడే నీకుఁ బాపపరిహార''మగు నని యుపదేశించెను.

ఎట్లైనను బాపవిమోచనమును గాంక్షించువాఁడు కావున రాజట్లే పరివారముచు వెంటఁగొని పుణ్యతీర్థముల సేవించుచు బ్రస్తుతము గుంటూరు మండలమున నున్న యమరావతి పట్టణముఁ జేరి కృష్ణానదీ పుణ్యతోయముల మునింగినంతనే యాతని మలినవస్త్రములు ధౌతవస్త్రము లయ్యెను. పాపవిమోచన మైనందుకు రాజునకుఁ గలిగిన సంతోషమునకు మేర లేదు. అతఁ డచ్చోటనే నిలచిపోయెను. అదే కాలమున చందవోలు ప్రభుఁడు తన యనుంగు కూఁతురైన మైలమదేవికిఁ బాణిగ్రహణ మొనర్ప నెంచి తగిన వరునికై యన్వేషింపఁ దొడంగెను. అలుగురాజవివాహితుఁ డగుటవలన వరాన్వేషణార్థమై గ్రుమ్మరుచున్న విప్రులాతని వయో రూప గుణాదుల ననేక విధముల నభివర్ణించి తమ యేలికకు విన్నవించిరి. చందవోలు రాజును దగిన వరుఁడు లభించినందులకు మిక్కిలి సంతసిల్లి తన కుమార్తె నాతనికిచ్చి వివాహ మొనరించి తన రాజ్యమునందలి పలనాటిసీమ నామె కరణముగ నిచ్చెను.

ఈ పలనాటిసీమ గుంటూరు మండలమున నున్నది. ఆ కాలమున దీని విస్తీర్ణము షుమారు పదివందల యేబది

చదరపుమైళ్ళు. పూర్వ మొకప్పు డీ సీమ యాంధ్ర భృత్య వంశపు రాజుల కాలమునఁ బల్లవులచే నాక్రమింపఁబడెను. ఆ కారణమున దీనికి 'పల్లవనాఁడు' అని పేరు వచ్చెను. కాలక్రమమున నా పల్లవనాడే, పలనాడనియును, పల్నాడనియును వ్యవహరింపఁబడుచు వచ్చెను. తన భార్య యగు మైలమదేవి కరణముగా లభించిన యీ పలనాటిసీమను అలుగురాజు గురజాలను రాజధానిగ నొనర్చుకొని పాలించుచుండెను. అలుగురాజునకు మైలమదేవి గాక విజ్జలదేవి, భూరమాదేవి యను మఱి యిరువురు భార్యలు గలరు.

అలుగురాజు మంత్రి రేచర్ల వంశోద్భవుఁడైన దొడ్డనాయుఁడు. ఇతని తండ్రిపేరు బేతినాయుఁడు. అలుగురాజు ముగ్గురను భార్యలుగ బడసినను చిరకాల మాతనికి సంతానము కలుగలేదు. అందుచే నాతఁడు దొడ్డనాయని కుమారుఁడగు పెద్దనాయనిఁ బెంచుకొని వివాహ మొనర్ప నెంచెను. కాని పెద్దనాయుఁడు శూద్రుఁడగుటవలన నాతనికి క్షత్రియు లెవ్వరును బిల్ల నివ్వరైరి. అందుచే నలుగురాజు కొంతకాలమువఱ కా ప్రయత్నమును విరమించుకొనవలసి వచ్చెను. చివఱకొక బ్రాహ్మణుని యాదేశానుసార మలుగురాజు తాను బెద్దనాయని బెంచుకొనిన విషయమును గుప్తపఱచి కృష్ణగంధర్వుఁ డనువాని కుమార్తెయగు ముక్తాంబను బెద్దనాయనికి భార్యగ నొనర్చి యాతని సత్తవాకింటియొద్దనే యుంచెను.

పెద్దనాయని వివాహానంతర మలుగురాజున కేడ్గురు పుత్రు లుదయించిరి. మైలమదేవియందు నలగామరాజను వాఁడు జన్మించెను. వీనికే వీరకామేంద్రుఁడని నామాంతరము. విజ్జలదేవియందు ముప్పురు కుమాళ్ళను బడసెను. పెదమల్ల దేవుఁడు, బాలమల్ల దేవుఁడు, పినమల్ల దేవుఁడని వారి నామములు. వీరినే మలిదేవాదులందురు. భూరమాదేవికి ముప్పురుకుమారు లుదయించిరి. కామరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు. ఇంత దనుక నలుగురాజు వృత్తాంతమును, దత్పరివార పరిచయమును బొందితిమి. ఇఁక మనదృష్టిని మఱియొక నైపునకు మఱల్చుదముగాక !

---

# నాగమ్మ

వీరపవిత్రమైన పల్నాటిసీమయందు చిట్టగామాల పాడొక కుగ్రామము. చౌదరి రామిరెడ్డి యా గ్రామమునందొక చిన్నరైతు. సహనశీలి, కష్టజీవిగాన నెట్లో యుదరపోషణము గావించుకొనుచుండెను. ఈదారిద్ర్యమునకుఁ దోడు సంతానమునీయక భగవంతుఁ డాతనికిఁ గొంత మేలే యొనర్చినను, అనపత్యతాదుఃఖ మెట్టివారికైనను సహింపరానిదే గదా ! రామిరెడ్డియుఁ దన సంతానహీనత కప్పుడప్పుడు లోలోన దుఃఖించుచుండెను. ఏది యెట్లున్నను నతఁడు నిత్యసంతుష్టుఁడై యుండెననుటకు సందియములేదు.

"కృషితో నాస్తి దుర్భిక్ష"మ్మని పెద్దల వచనముగాన దానినే నమ్ముకొనినాడు.

ఒకనాటి యుదయమున రామిరెడ్డి తన పొలమును జేరెను. అట నరకపన్ని పొలము దున్నుచుండెను. అది నిర్జనప్రదేశమగుట నాతనికి మరొక వ్యావృత్తి లేకుండెను. ఇట్లుండ నా చేరువనే యొక శిశుక్రందనము వినవచ్చెను. ఇట్టి విజనప్రదేశమున శిశుక్రందనము వినవచ్చు టాతని కాశ్చర్య మయ్యెను. అంత నాతఁడటనుండి కదలి యా రోదనము విన వచ్చిన దిక్కు ననుసరించి పోయెను. అది యొక పెద్ద పొద. అందొక పెద్ద పుట్ట. ఆ పుట్టకు ప్రక్కనే లేఁబచ్చికపాన్పుపై ముక్కుపచ్చలారని యొక ముద్దుపాప యేడ్చుచుండెను. ఆ బిడ్డచెంతనే యొక నగలమూటగూడ నుండెను. అతఁడాబిడ్డను చూచి "ఆహా! స్త్రీ లెంతకైనను తగుదురుగదా! ఈ పసి పాప ముద్దుమోము వీక్షించిన మాత్రమున కటిక కిరాతుని హృదయమైనను గఱఁగిపోవును గదా! అట్టి యీ ముద్దుల పాపను నవమాసములు మోసి యిట్లు నట్టడవిని దిక్కులేకుండ వదలివెళ్ళిన యాతల్లి యెంతటి కఠినహృదయయోగదా! బహుశః ఆమె విధవయైయుండనోపు! లోకాపవాద భయం బున నింతటి దారుణకృత్య మాచరించి యుండవచ్చును. తన మనము నరికట్టుకొనఁజాలక తా నొనరించిన పాపమున కీ శిశువు నిట్లు హింసించుటకంటె మఱియొకనిని వివాహమాడిన నెంత బాగుండెడిది! ఆహా! కాలమహిమ! సంఘబహి ష్కారమునకును, లోకాపవాదమునకును వెఱచి యెందరు

నిరంతరము లిట్టి పాపకార్యము లొనర్చుచున్నారు గదా! ఎన్ని భ్రూణహత్యలు! ఎన్ని శిశుహత్యలు! హిందూ ధర్మమా! నీ పరమభక్తులైన సనాతను లీ శిశువును జూచి తమ ధర్మ ప్రాశస్త్యమును వేనోళ్ళ పొగడుదురా? లేక కన్నీటి కాల్వల ప్రవహింపజేసి యందీ దురాచారముల విసర్జింతురా?'' యని తనలోఁ దాను కొంతవడి యాలోచించుకొనెను. తరువాతఁ గొంతతడవు "దూరాలోచనలేక యిట్లు తలఁచితినిగాని, యేరేని చోరు లీ పిల్ల నపహరించి యిట వదలిపెట్టి వెళ్ళియుండగూడదా?'' యని వితర్కించుకొని "కాదు. అట్లయిన యీ శిశువునకుఁ బ్రక్కన నీ నగలమూట యుండుటఁ జూడ చోరు లొనర్చిన పనికాదు. తల్లియే యిట్టి కట్టడి కార్యమున కొడిగట్టియుండవలె'' నని నిశ్చయించుకొనెను.

ఆ పసిపాపను జూచుటతోడనే యాతని హృదయమున నావరించిన భావ మేమోగాని, వెంటనే యాతఁ డా శిశువు నెత్తుకొని యక్కునఁ జేర్చి ముద్దాడ మొదలిడినాఁడు. అనపత్యతాదూషితుఁడై యున్న తన కీ రూపమున భగవానుఁడు సంతానము ననుగ్రహించెనని యెంచెను గాబోలును! ఇఁక రామిరెడ్డి కాలు నిలువలేదు. చెంగుచెంగున నింటికేఁగినాడు. సంతోషమున నాతని మే నుబ్బిపోవుచుండెను. ఇంటికిఁ జేరి బిడ్డను భార్యకుఁ జూపెను. ధనమును, బిడ్డను భార్య చేతులం దుంచి జాగ్రత్తగాఁ బెంచుమని హెచ్చరించెను. నాగేంద్రుని పుట్టదాపున లభించుటంజేసి 'నాగమ్మ' యని

నామకరణ మొనరించి యా దంపతు లా శిశువు నల్లారు ముద్దుగఁ బెంచసాగిరి.

అదేమి యదృష్టమోగాని యాబిడ్డ యింటిలో నడుగు పెట్టిననాఁటనుండియును రామిరెడ్డి సంసారము మూఁడుపువ్వు లారుకాయలు కాఁజొచ్చెను. అతని దారిద్ర్యమున కానాటితో స్వస్తి. అతఁడు తనకు లభించిన ధనమును వడ్డీలఁ బెంచుచు నాస్తిపాస్తులను పెంపొందించుకొనుచుండెను. కొలదికాలములో నాతఁడు తగినంత భూమిని సంపాదించెను. నాగమ్మతోఁబాటుగ నాతని భాగ్యమును దినదినప్రవర్ధమాన మగుచుండెను. నాగమ్మ యుక్తవయస్కురాలై నిండు జవ్వనముతో, మురుపు లొలికించు మోహనరూపముతోఁ, జక్కని చదువులతో నాగ్రామమున కలంకారప్రాయముగ నుండెను. రామిరెడ్డి కిఁక నామెకు వివాహ మొనరింపవలె నను చింత యధికమయ్యెను. ఆతఁడు కుమార్తెకుఁ దగిన వరు నన్వేషింప మొదలిడెను. తుద కొక చక్కని మనువు విచారించి వివాహ మొనరించెను. కాని యామె యదృష్టమున సంసారసౌఖ్యము లిఖింపబడి యుండలేదు కాఁబోలును! కొలఁది దినములకే యామె భర్త దివంగతుఁ డయ్యెను. దానితో నామె జీవిత మంధకారబంధుర మయ్యెను. అల్లుని మరణవార్తను విని రామిరెడ్డియు నాతని భార్యయును, శోకసాగరమున మునింగి మంచముఁబట్టి కృశించి మరణించిరి. గోరుచుట్టుపై రోకఁటిపో టన్నట్లు నాగమ్మకు భర్తృవియోగముతోఁబాటు మాతాపితృవియోగముకూడ సంభవించెను.

కష్టము లెన్నడును నొంటిగ రావుగదా! ఆమె జీవితమన్ని విధముల దుఃఖభాజనమై పోయినది. ఆమె కిఁక 'నా' యను వారలేరు.

నాగమ్మ యిప్పుడు పుట్టినింటికిని, మెట్టినింటికిని నధికారిణియయ్యెను! వారసులు లేకపోవుటవలన నామె కిరు వైపుల యాస్తియు సంక్రమించెను. ఆమె తనకు సంభవించిన దుర్గతినిగూర్చి నిరంతర దుఃఖభారాక్రాంతయయ్యెను. రోజులు గడచిన కొలఁది దుఃఖమును మఱచినది. తన వద్దనున్న ద్రవ్యము నా యూరి ప్రజల క్షేమమునకై వినియోగించుచు నా యూరివారి మన్ననలఁ బడసి నాయకురాలయ్యెను. అనతి కాలముననే యామెపేరు చుట్టుప్రక్కలనున్న గ్రామములకు గూడఁ బ్రాకెను. గ్రామవాసులందఱామెయెడ భక్తిశ్రద్ధలఁ జూపఁజొచ్చిరి.

ఆ దినములందుఁ జుట్టుప్రక్కల నుండెడి యాటవిక జాతులవారు సమీపగ్రామములపైఁబడి ప్రజల హింసించుచు దోచుకొనుచుండిరి. నాగమ్మ యెట్లయిన నాటవికజాతులగు చెంచులు, కోయలు మున్నగువారి హింసలనుండి గ్రామీణుల రక్షింపనెంచి కొంతమంది వీరయువకులఁ బ్రోగుచేసుకొని తాను నాయకత్వము వహించి వారి నదుపులోనికిఁ దెచ్చినది. దీనితో నామెకున్న 'నాయకురా' లను నామము సార్థకమైనది. పల్లెప్రజ లామెను బ్రహ్మరథముఁ బట్టిరి. నాగమ్మ యెంతటి సౌందర్యవతియో యంతటి సాహసికురాలు. కత్తిఁబట్టి కదనరంగమున నరవీరులఁ జెండాడు ధైర్య

సంపన్నురాలు. ఆమెయందుఁ బ్రజ్ఞ, కార్యనైపుణ్యము మూర్తీభవించినది.

---

# విద్వేషము

ఉపక్రమణికలో నాకాలమున పలనాటిసీమ నలుగురాజు పరిపాలించుచుండె నని చదివి యున్నాము. ఆతని వంశముగూడ మనకుఁ బరిచితమే! ఆ యలుగురాజునకు రేచర్ల వంశోద్భవుఁడైన దొడ్డనాయుఁడు మంత్రి. దొడ్డనాయని సతీమణి శీలమ్మ. దొడ్డనాయని కేవురు పుత్రు లుదయించిరి. అంగు పెద్దవాఁడు పెద్దనాయుఁడు. రెండవవాఁడు బ్రహ్మనాయుఁడు. మూడవవాఁడు సూరిసీఁడు. నాల్గవవాఁడు పేరిసీఁడు. కడపటివాఁడు మల్లిసీఁడు. ఇందు బెద్దవాఁడైన పెద్దనాయని నలుగురాజు పెంచుకొని వివాహ మొనరించుటనుగూర్చి మనము వెనుక చదువుకొని యున్నాము. ఈతఁడు పేరుబొందిన రౌతు. రెండవఁవాఁడైన బ్రహ్మనాయుఁడు రాజనీతికుశలుఁడు, ప్రజ్ఞాదురంధరుఁడు, మహామనీషి. మిగిలిన ముగ్వురును వీరయోధులు. బ్రహ్మనాయని భార్యయగు ఐతమ్మ సుగుణవతి, వీరపత్ని. ఈమెయందు బ్రహ్మనాయనికి జనించిన యేకైక పుత్రుఁడే పలనాటి భారతమున నభిమన్యుఁడని వినుతికెక్కిన బాలచంద్రుఁడు.

అసమాన ప్రజ్ఞాదురంధరుఁ డగు దొడ్డనాయుఁడును నాతని కుమారులును, దన్ను గొలువ, రిపుభయంకరుఁడై

యలుగురాజు పల్నాటిసీమ నేలుచుండెను. ఏమి కారణముననో గాని, నాగమ్మకును దొడ్డనాయనికిని విద్వేష మంకురించెను. ఆ విద్వేషాంకురము నానాట నభివృద్ధినొంది యిరువురి హృదయములందు గాఢముగ నావరించెను. ఒకరినొకరు సాధింప కృతనిశ్చయులై యుండిరి. నాగమ్మ దొడ్డనాయని సాధించుటకుఁ దగిన సమయమునకై వేచియుండెను. నాగమ్మ పగగొన్న నాగాంగనయై చలించని పట్టుదలతో దొడ్డనాయని వంశ నిర్మూలనము తన కర్తవ్యముగ నెంచుకొనినది. కాని, యాతనిని సాధించుటెట్లు? అతఁడు మహామంత్రి, రాజ్యకార్య దురంధరుఁడు, అశేష ప్రజ్ఞావంతుఁడు, గణుతింపరాని సైన్యమున కధికారి. ఐనను నాగమ్మ నిరుత్సాహపడలేదు. కార్యాచరణమున కుపక్రమించినది. ఎట్లో రాజానుగ్రహమును సంపాదించినది. తన దీనచరిత్రను రాజసన్నిధిని నివేదించుకొని రాజునకుఁ గరుణ పుట్టించినది. అంతట నామె తన బుద్ధి చాకచక్యము నుపయోగించి రాజు మనస్సు నాకర్షించినది. అటుపిమ్మట నామె రాజుతో దొడ్డనాయనిపైఁ గొన్ని నేరములు మోపి యవిశ్వాసము గలిగించెను. అనుమాన మొక మహారోగముకదా! అలుగురాజునకుఁ గ్రమక్రమమున దొడ్డనాయనిపై నవిశ్వాసము నభివృద్ధి గాంచెను. దొడ్డనాయని ప్రతి పనియు నాతని యవిశ్వాసమును బలపఱచుచుండెను. మంత్రిమాట నాతఁడు పాటించుట మానివేసెను. రాజునకు నాగమ్మ సలహాలు వేదవాక్యములైనవి. రాజకార్యములం దామె సలహాలు

శిరోధార్యములు. కాల మొక్కరీతిగఁ గడువదు. ఒక సామాన్యస్త్రీ రాజకార్యములు హస్తగత మొనరించుకొనినది. మహామంత్రి తన యధికారమును గోల్పోయి యడుగడుగునకు నవమానితుఁ డగుచున్నాఁడు. జేని నిగ్రహానుగ్రహములు క్షణికములుఁగదా! దొడ్డనాయుఁ డిది యంతయు గ్రహించుచునేయున్నాఁడు. 'పాకము ముదిరినది. ఇక లాభములేదని' గ్రహించి మంత్రిపదవిని దన రెండవ కుమారుఁడైన బ్రహ్మనాయని కొసంగి తాను కొలువునుండి వైదొలఁగెను.

బ్రహ్మనాయుఁడు సకలశాస్త్ర పారంగతుఁడనియును, ప్రజ్ఞానిధియనియును, సమస్త నీతికుశలుఁడనియును వెనుక తెలుసుకొనియున్నాము. మంత్రిత్వమును గ్రహించుటతోడనే బ్రహ్మన్న రాజుమనస్సు మార్చుటకై యనేక ప్రయత్నములొనరించెను. కాని, యవి యన్నియును నిష్ఫలములైనవి. అప్పు డాతఁ డాత్మలాభప్రేరితుఁడై యధికార ప్రాబల్యమునుఁ గాంక్షించి యలుగురాజునుఁ జంపించెనఁట. (ఇది యెంతవరకు సత్యమో తెలియదు.) కాని, నాగమ్మచేతి కీలుబొమ్మగ నున్న రాజుకొలువునందు దా నొక మట్టిబొమ్మగ నుండుట కిచ్ఛగింపక, యట్లొనర్చుటయం దాశ్చర్యముండదు. కాని బ్రహ్మనాయుఁడు ప్రజాక్షేమమునుఁ గాంక్షించువాఁడనుటమాత్రము సత్యము. అది ప్రజోపయోగార్థమును, రాజ్యక్షేమముకొఱకును నగుటచే దోషమనుటకు వీలులేదు.

అది చరిత్రయందలి చెఱిగిపోయిన పుటయగుటచే మన 'మిదమిద్ధ'మని నిర్ణయింపఁజాలము.

అలుగురాజు చనిపోయిన తరువాత బ్రహ్మన్న నలగాముని రాజుగఁజేసెను. అంతటితోఁ నూరకొనక యితరు లెవ్వరును రాజు నేకాంతముగఁ గలుసుకొనరాదని యాజ్ఞాపించి, కన్నమదాసను హరిజనవీరు నొకనిని సర్వసైన్యాధిపతిగ నొనరించి వేయికన్నులతో రాజ్యమును బాలించుచుండెను.

అలుగురాజు మరణముతోడను, బ్రహ్మన్నమంత్రి పదవీస్వీకారముతోడను, నాగమ్మకు మఱలఁ బ్రతిబంధకము లేర్పడినవి. ప్రస్తుత శాసకుఁడైన నలగామరాజునకును నామెకును బరిచయము లేదు. నలగాముని మానసిక ప్రవృత్తు లామెకు సరిక్రొత్తలు. వీటియన్నిటికిని బైన బ్రహ్మనాయుని శాసనములు. ఇట్టి తరుణమున నాగమ్మ చేయున దేమి? ఆమె రాజానుగ్రహమును బొందు టెట్లు? నాగమ్మ ధీర స్వభావురాలు గాన, నధైర్యపడక తరుణమునకై వేచియుండెను.

---

## రాజానుగ్రహము

ఇట్లుండ నొకనాఁడు నలగాముఁడు సపరివారుఁడై మృగయావినోదార్థము వెడలెను. క్రొత్తరాజు ననుగ్రహము సంపాదింప తరుణమునకై వేచియున్న నాగమ్మ కీవార్త తెలిసినది. ఆమె యడవిలో నతనికిఁ దగిన వసతుల నేర్పఱుపఁ

దన చెంచువీరుల కాజ్ఞనిచ్చినది. క్షణములోఁ గంటకావృతమగు ప్రదేశము వాసయోగ్యమైనది. ఆమె యచటఁ జలిపందిళ్ళను వేయించినది. స్నానపానార్థమై యుష్ణశీతోదకముల సిద్ధమొనరించెను. మధురములైన వన్యఫలములను, రుచికరంబులగు వంటకంబులను సమకూర్చినది. రాజసత్కారమునకై వలయు సన్నాహముల నొనరించి నలగాముని రాకకై ప్రతీక్షించుచుండెను.

ఇంతలో నలగాముఁడు మృగయానివృత్తుఁడై భరింపరాని తమకంబున దప్పిగొని విశ్రమింప నర్హంబగు ప్రదేశమునకై యన్వేషించుచుండ నాగమ్మ చూచినది. వెంటనే యామె పరిజన మాతని కెదురేగి సగౌరవముగఁ గొని తెచ్చిరి. రాజు పరివారముతోఁగూడి జల్లని పందిళ్ళక్రింద విశ్రమించి, కమ్మని పదార్థములఁ గడుపార నారగించి తృప్తుఁడయ్యెను. నాగమ్మ యొనరించిన సమర్యాసత్కారములతో నాతని శ్రమ శాసినది. నలగాముఁడు సంతుష్టుఁడై 'ఆహా! నాకై యీ నట్టడవిలో, నింతటి శ్రమ గైకొనిన వ్యక్తి యెవ్వరోగదా! ఈ వ్యక్తి యొనర్చిన యేర్పాటుల యెదుట నిలువంజాలక శ్రమయంతయును నేమూల దాగినదో! ఆ వ్యక్తి యెవ్వరైన నేమి? మా యెదుటకువచ్చి కోరినచో సర్వస్వము నర్పింతుము గదా!' యని తనలో ననుకొనుచు మోదవారాంబుధిని మునిఁగియుండెను. నాగమ్మ ఇదియే యనువైన సమయమని యెదుటబడినది. చేతులు జోడించి వినమితగాత్రయై భక్తిశ్రద్ధలు బ్రదర్శించినది. శృంగారవీరములు

మేళవించిన ఆ నారీమూర్తిఁ నలగాముఁడు జూచి విస్మితుఁడై—"నాగమ్మా! నీవేనా మాకీ సుఖమును గూర్చినది? నీవు మాకై యింతటి శ్రమ గైకొంటివేల? నీవు నారీరూప రాక్షసివనియు, రాజద్రోహివనియు, మా బ్రహ్మన్న మంత్రి యనెడివాఁడే! నేటి నీ చందమునుఁ జూడ మాకేమియుఁ దోచకున్నది. నీవు మమ్మీ రూపమున మోసగింపనెంచ లేదుగదా!" అనెను.

ఈ మాట లాలించి నాగమ్మ వెచ్చనూర్పుచు, "రాజా! నేను మీ తండ్రిగారి దయకుఁ బాత్రురాలను. నేను మీకు విరోధి నెట్లు కాఁగలను? మిమ్ములనే మొదటినుండియు నమ్ముకొని యున్నదానను. మీతోడ విరోధమా! శివ! శివ! యెంతమాట! నా జీవితమునంతను ప్రభువుల క్షేమముకొఱకై యంకిత మొనర్చినదానను. నేను తండ్రిగారి యాశ్రయము లభించినదిగదా యని సంతసించితిని. కాని, బ్రహ్మనాయుఁడకారణముగ నాతో వైరమును బూని నాపై యవిశ్వాసమును గలిగింపఁ బ్రయత్నించుచున్నాఁడు. ప్రభువును బట్టఁబెట్టుకొనిన బ్రహ్మనాయుఁడా రాజద్రోహి లేక నేనా? రాజ్యక్షేమమను నెపమున రాజును హత్యచేయించిన బ్రహ్మనాయుఁడు విశ్వాసపాత్రుఁడా! నేను కానా! ఏలినవారికి నే నెన్నఁడు నొక్క యపకారమైనను తలపెట్టి యుండలేదే ప్రభూ! బ్రహ్మనాయుని మాటల నమ్మి యీ సేవకురాలిపైఁ గినుకఁ బూనకుఁడు. అనుగ్రహింపుఁడని రాజు మనమునకెక్క బ్రార్థించెను.

నాగమ్మమాటల కాతని హృదయము ద్రవించినది. నాగమ్మపై నాతని కనుగ్రహము కలిగెను. "నీ కేమి కావల యునో కోరుకొను" మని యనినాఁడు. అంత నాగమ్మ చేతులు జోడించి "ప్రభూ! కొన్ని ఘడియలు ప్రభుత్వము చేయవలెనని మనసు పుట్టినది. మీ యనుగ్రహమునకుఁ బాత్రురాలనైనచో సంతసించెద" ననెను.

నాగాంబ యొనరించిన యుపకారభారమునకుఁ గ్రుంగి పోవుచున్న నలగాముఁడు వెంటనే "నాగాంబికా! తీవ్ర చండాతపంబున డస్సి దప్పిచేఁ బీడింపఁబడుచున్న నన్నును, నా పరివారమును నీవిధముగ నాదరించి, సత్కరించి ప్రాణ దాన మొనర్చిన నిన్ననుగ్రహింపకుండు టెట్లు? నీ వడిగినట్లే యొనర్చెద. ఇష్టము వచ్చినప్పుడు వచ్చి నీకోరిక నెఱవేర్చు కొనవచ్చు"నని సమాధాన మొసంగి సపరివారుఁడై రాజ ధాని కేగెను.

కాలము గడిచెను. తగిన సమయమునకై వేచి యున్న నాయకురా లొకనాఁడు రాజసన్నిధి కేతెంచి మున్నాతఁ డిచ్చిన వాగ్దానమును జ్ఞప్తికెలయించెను. నల గాముఁడును ముందువెనుక లాలోచింపక రాజముద్రిక నొసఁగినాఁడు. ఇఁక నాగమ్మకు కావలసిన దేమి! అసలే జిత్తులమారి. దానికిఁదోడు రాజ్యాధికారము! ముందుగనే సిద్ధపరచియుంచిన ముష్కరులైన కిరాతకుల బిలిపించినది. గ్రామములను గొల్లగొట్టి ధనము గొనిరండని యాజ్ఞాపించి నది. వారెల్ల నామె యాజ్ఞానువర్తులై గ్రామములపైఁబడిరి.

పల్లెల నిచ్చుకు వచ్చినట్లు దోచి ధనరాసులఁ దెచ్చి నాగమ్మ కప్పగించిరి. నాగమ్మ యాధనముతో నలగామునికి పాద పూజ చేసినది. నలగాముఁ డా ధనరాసులఁజూచి నిశ్చేష్టుఁ డైనాఁడు. తగిన సమయమిదేయని కనిపెట్టి నాగమ్మ వెంటనే ప్రారంభించినది. "ప్రభూ! చూచితిరా? పరిపాలన మన్న ని ట్లుండవలయును. ధనాగారమున వలసినంత ధనము లేకున్న రాజ్యపాలన మెట్లు సాగును? నాయుఁ డెప్పుడైన నింత ధన మును బ్రోవుచేయఁగల్గెనా? అతఁ డెట్లు చేయును? రాజ్య మున్ననేమి? పోయిన నేమి? ప్రజలనుండి లంచములను గొని తక్కువ శిస్తులు వసూలుచేయుచు స్వలాభము గోరు వాఁడు ధనాగారము నెట్లు నింపఁగలఁడు? అతఁడు పయో ముఖ విషకుంభమువంటివాఁడు. ఇటులనే యున్నదంతయు నెచ్చించి, వీలయినది చేఁజిక్కించుకొని మిమ్ములను, రాజ్య మును గాలికి విడుచుట యాతని యాశయము గాఁబోలు! కపటవినయంబులఁ బ్రదర్శించి కడకు మీ ప్రాణముసైతము హరింపగలప్రజ్ఞావంతుఁడు. ఇది యిట్లుండునిండు. రహస్యముగ నేను చారులవలన వినిన యొక విషయమును మనవిచేతును. బ్రహ్మన్న తమ సవతి తమ్ములగు పెదమల్లి దేవాదులతోఁ గూడి కుట్రపన్ని తమ రాజ్యమును హరింపఁ దలచుచున్నాఁ డట. సర్వాధికారములను నాకుఁ బ్రసాదించినచోఁ గొలది దినములలో బ్రహ్మనాయని యాట కట్టింతు ననుచు బ్రహ్మ నాయనిపై ద్వేషపూరిత వాక్కు లనేకములు పలికినది. పాపము! వాని నన్నిటిని నమ్మినాఁడు నలగాముఁడు. నమ్మక

చేయున దేమి ? దుర్భరమగు సూర్యాతపమునఁ పిపాసార్థితుడై గ్రుక్కెడు నీటికై యల్లాడుచు బాధచే నసువుల బాయవలసిన దుస్థితి వాటిల్లినప్పుడు తన శ్రేయముగోరి సత్కరించి ప్రాణదాన మొసంగిన నాగమ్మను నమ్మకపోవు టెట్లు! నాగాంబ నిష్కారణముగ బ్రహ్మనాయని నెందుకు ద్వేషించు నని మనసును సమాధానపఱచుకొని, నాగమ్మకు సర్వాధికారము లొసంగెను. నాటినుండి బ్రహ్మన్నతోఁబాటు పెదమల్లిదేవాదులనుగూడ నెట్లయిన మట్టుపెట్టవలయునని సంకల్పించి నాగమ్మ తగిన వ్యూహములను బన్నసాగినది.

నాగమ్మ తన కుతంత్రము నెంత రహస్యముగ సాగించుచున్నను గొద్దిగా బహిరంగమైనది. ఈమె కుట్రలు కర్ణాకర్ణిగ బ్రహ్మనాయని తల్లియగు శీలమ్మకు దెలిసినవి. శీలమ్మ మెల్లగ వీరవిద్యాదేవి సుతులను తనయింటికిఁ జేర్చి కుమారుని బిలిచి విషయము నంతను సవిస్తరముగ జెప్పి మలిదేవాదుల రక్షణభారము నాతనిపై మోపెను. మొదటినుండియు రాజుయొక్కయు, నాయకురాలియొక్కయు జేష్టలను జూచుచునే యున్నాఁడు గాన, బ్రహ్మనాయుఁడు సర్వము నవగత మొనర్చుకొని మలిదేవాదుల రక్షణకై బద్ధకంకణుఁడైనాఁడు. ప్రథమమున బాలురగు మలిదేవాదులను గుర జాలనుండి తప్పించుట యుక్తమని నిశ్చయించి రాజసన్నిధి కేగి యిట్లని విన్నవించెను—"దేవా! తా మెంత యభిమానముతో సాకినను సవతి తమ్ములు సవతితమ్ములే! నేఁటి వఱకు వారిని మీరు తండ్రివలెఁ గాపాడినాఁరు. కాని

లోకులు పలుగాకులుగదా! లోకులు తమ్ములయందలి తమ ప్రేమను సవతి ప్రేమగనే తలంతురు గాని, యన్యథా తలంపరుగదా? అందుచే 'వేయేండ్ల కేని వేఱుఁ తప్పదను' లోకోక్తి కలదు గాన, నట్టి యపకీర్తి నొందకుండఁగనే వారికి గొంతభాగం బొసంగి పంపుట యుచితము. ఇది నాకుఁ దోచిన తెఱఁగు. ఆ పైని దేవరచిత్తము."

బ్రహ్మనాయని మాటలాలకించి నలగాముఁడు నాయకురాలితో మంతనం బొనర్చినాఁడు. బ్రహ్మనాయుని పీడ నెట్లయిన వదలించుకొనఁ దలచినది గాన నాగమ్మ యట్లే యొనర్పుమని సలహా యిచ్చినది. నలగాముఁడును తల యూపినాఁడు! నాయుఁడు వెంటనే మలిదేవాదుల భాగమును నిర్ణయింపఁజేసి వీరవిద్యాదేవిని, మలిదేవాదులను వెంటనిడుకొని నలగామునియొద్ద సెలవుగొని మాచెర్లకుఁ జేరి యట రాజ్యపాలనము చేయ మొదలిడెను.

బ్రహ్మనాయుఁడు గురజాలను వీడుటతో నాగమ్మ తలపెట్టిన కార్యము కొంత సఫలమైనది. ఆమె మాట సుగ్రీవాజ్ఞయైనది. రాజామెచేతిలోని కీలుబొమ్మ. ఇఁకఁ గావలసిన దేమి? తా నాడినది యాటయుఁ బాడినది పాటయునైనది. బ్రహ్మనాయని ప్రధానత్వముగూడ నామెకే లభించెను. నిద్రాహారములుగూడ మాని బ్రహ్మనాయని వంచించు యుపాయములనే యన్వేషింప మొదలిఁడెను.

---

# రామరాజ్యము

ఇంతవఱకు గురజాల పరిస్థితులను గొంతవఱ కెఱింగి తిమి. ఇఁక నూతన రాజధానియై బ్రహ్మన్న యేలుబడి యందున్న మాచెర్ల నొకపరి దర్శింతము.

గురజాలను వీడి వచ్చినపిమ్మట బ్రహ్మన్న ప్రధానియై మాచర్ల నేలఁజొచ్చెను. అతని పరిపాలనము రామరాజ్యమును జ్ఞప్తి కెలయించెను. బ్రహ్మనాయుఁడు రాజనీతి ధురంధరుఁడేగాక గొప్ప విష్ణుభక్తుఁడుగూడ. మత విశ్వాసముతోఁ బాటు దేశభక్తియు, దేశభక్తితోఁబాటు ప్రజాభిమానమును గలవాఁడు. మాటలఁ జేతలఁ జూపినాఁడు. మతాభిమాని యయ్యు సంఘసంస్కరణాభిలాష కేవల ముపన్యాసములతోఁ బర్యవసాన మొందించక కార్యశూరుఁడై ముందుకువచ్చెను. రాజ్యపాలనాధికారియైన తాను సంస్కరణల నాచరించి చూపుట యుక్తమని భావించెను. అస్పృశ్యత హిందూధర్మమునకుఁ దీరని కళంకమని గుర్తించి దానిని రూపు మాపి హిందూమతమును సముజ్జ్వలమొనరింప సమకట్టెను. తెప్పలినాయని కుమారుఁడగు మాలకన్నమదాసుని దగ్గఱకుఁ దీసినాడు. కన్నపుత్రునికంటె నెక్కుడుగఁ బెంచి పెద్దఁజేసి విద్యాబుద్ధులతోఁబాటు కత్తిసామునుగూడ నేర్పి వైష్ణవధర్మము నుపదేశించెను. పాపము! సనాతనాచారములతోఁ గరడుగట్టిన హిందూమతోపాసకుల నానాఁడు బ్రహ్మనాయని యాచర్య యెంతగఁ గలఁచివైచినదో? వీంపప్రత్తి

మైన యాంధ్రభూమియే సంఘసంస్కర్తలకును బుట్టినిల్లయి నది. అస్పృశ్యతా నివారణోద్యమము తెలుఁగునాటఁ బ్రప్రథమమునఁ బ్రారంభించి యాంధ్రజనయిత్రికి యశము నార్జించి పెట్టినాఁడు బ్రహ్మనాయుఁడు. సంఘసంస్కరణమున ముందంజ వేయువారు తెలుఁగు లని నిరూపించినాఁడు మన బ్రహ్మన్న. బ్రహ్మన్న యొనర్చిన యీ కార్యము నేఁటికిని కేవల మాంధ్రుల కేగాక ప్రతిభారతీయునకు నాదర్శమైనది.

కన్నమదాసునకుఁ దండ్రియు, గురువు, దైవము సర్వమును బ్రహ్మనాయుఁడే. ఆతనిమాటయే కన్నమదాసు నకు వేదవాక్యము. ఎన్నఁడుగాని యాతని యాజ్ఞ జవదాటి యెరుఁగఁడు. తదాది యీ కన్నమదాసే కన్నమనాయుఁడని వినుతికెక్కెను.

బ్రహ్మనాయుఁ డిట్లు శైవమతము విజృంభించిన యీ దినములలో సంఘసంస్కరణాభిలాషియై, జాతిభేదము లెంచక యనేకులకు వైష్ణవధర్మ ముపదేశించుచుఁ బ్రజానురంజక ముగఁ బాలన మొనర్చుచుండెను. బ్రహ్మనాయని భార్య ఐతాంబ. దయయు, సత్యము, ఓర్పు నామెకుఁ బెట్టని యాభరణములు. అన్నివిధముల బ్రహ్మనాయనికిఁ దగిన భార్య. ఈ పుణ్యదంపతుల నోములపంటయో యన జనించిన వాఁడే పల్నాటి భారతమున నభిమన్యుఁ డని ప్రఖ్యాతిగడిం చిన బాలచంద్రుఁడు. బ్రహ్మనాయని జాతిమతసామరస్య మును బాలించుచుండెనా యనునట్లు విభిన్నజాతుల బాలు రతో బాలచంద్రుఁడు స్నేహ మొనరించెను. బ్రాహ్మణ

బాలుడగు అనపోతు, వెలమచిన్నవాఁడైన దోర్నీఁడు, చాకలి పాపఁడైన చందన్న, కుమ్మరికుఱ్ఱవాఁడైన తేర్కుఁడు, కమసాలి చిన్నవాఁడైన చంద్రుఁడు, మంగలిబుడుతఁడగు మంచన్న ముఖ్యస్నేహితులు. వీరందఱును బాలచంద్రుని బహిఃప్రాణములు. ఆటపాటలలో, నాహారవిహారములలో నిత్యమును వీరితో గలసిమెలసి యుండెడివాడు. క్రమక్రమముగ బాలచంద్రుఁడు చదువుసంధ్యలలోఁ, గత్తిసాములలోఁ ప్రవీణుఁడయ్యెను.

గురజాలను వీడియు, బ్రహ్మన్న పరివారము నిత్యసంతృప్తితో నుంటఁజూడ నాయకురాలి కన్నులు కుట్టినవి. బ్రహ్మనాయని కుమారుఁడైన బాలచంద్రుని గుణగణంబులు వినుటవలన నామె యసూయ దినదినప్రవర్ధమానమయ్యెను. ఏయుపాయముచేతనైనను బాలుని జంపించి బ్రహ్మన్న పరివారమును దుఃఖకూపమునఁ ద్రోయుటయు సమకట్టినది. బ్రహ్మనాయని శక్తియు దౌర్బల్యమును ఆమెకు సుపరిచితములే. బ్రహ్మనాయనికి జ్యోతిషమునం దపారవిశ్వాసముంట జ్ఞప్తికి దెచ్చుకొన్నది. ఆమె ఒక జోస్యుని రావించి బ్రహ్మనాయనియొద్దకుఁ బంపి బాలచంద్రుఁడు నష్టజాతకుఁడనియును, నాతనివలనఁ బలనాటిసీమలో రక్తస్రవంతులు ప్రవహించుననియును చెప్పించెను. ఈ వంచకుఁడగు జోస్యుని మాటలు బ్రహ్మన్న నమ్మెను. దేశకల్యాణమును గోరినవాఁడు కావున తనపుత్రునైనను బలి యొసంగి దేశమును రక్షింపవలెనని నిశ్చయించి [illegible]



బాలుని వధించిరమ్మని యాజ్ఞ నిచ్చెను. కన్నమదాసు బాలుని జంపుటకు చేతులురాక బ్రహ్మనాయుని యన్నయగు పేర్నినియొద్ద బాలచంద్రునిదాచెను.

కొంత కాలమిట్లే గడచినది. ఒకనాఁడు బ్రహ్మనాయుఁడాప్తులును, మిత్రులును, బరివారమును బరివేష్టింపఁ గొలువున్న సమయమున గండు కన్నమనాయుఁడు తన కూతురగు మాంచాల నచటికిఁ గొనివచ్చి సభాసదులకుఁ జూపినాఁడు. "ఈమె నొక యుత్తమవంశసంజాతుఁడైన వీరయువకున కిచ్చి వివాహ మొనరింప నిశ్చయించితిని. అట్టివా రిందెవరయిన నున్నచో ముందునకు రండ"ని పలికెను. దీనిని వినిన పెర్నిఁడు బాలుని రావించి కన్నమ నాయునితో నీ పుత్రి నీతని కిమ్మని కోరెను. బ్రహ్మన్న బాలుని జూచుటతోడనే తనయాజ్ఞను ద్రోసిపుచ్చిన కన్నమదాసుపైఁ గోపగించి మరల నీతని గొనిపోయి శిరచ్ఛేదన మొనరించి శిరమును గొని తెమ్మని యాజ్ఞాపించెను. కన్నమదాసు చేయునదిలేక బాలుని వధ్యభూమికిఁ గొంపోయి శిరచ్ఛేదన మొనరింప నుంకించు సమయమున పేర్నిఁడు నురుగులు గ్రక్కుచు వచ్చి చేరెను. బాలుని తన తమ్ముని యొద్దకుఁ గొనిపోయి కరుణరస ముట్టిపడునట్లు "లేక లేకపుట్టిన యీ మనవంశాంకురమును రక్షించు"మనియు, "నీ కీతఁడు బరువైనచో నేనే యీతని బెంచుకొనెద"ననియుఁ గోరెను. బ్రహ్మన్న కనికరించి మన్నించెను. వెంటనే కన్నమనాయని కూతురగు

మాంచాల నాతని కిచ్చి వివాహ మొనర్చి తనయుని, గోడలిని బ్రహ్మన్న ఆశీర్వదించెను.

బాలచంద్రుని జంపింప దానొనర్చిన ప్రయత్నము భగ్నము కాఁగా నాగమ్మ కగ్నిలో నాజ్యము పోసిన ట్లయ్యెను. బాలచంద్రుఁడు వివాహితుఁడై సుఖముగ నుండు టయు బ్రహ్మనాయని పర్యవేక్షణమున మలిదేవాదుల రాజ్యము జనరంజకమై, సిరిసంపదలతోఁ దులదూగుచుండు టయుఁ జూడ నామె విద్వేషాగ్ని మరింత ప్రజ్వలించెను. మాంచాలపై బాలుని మనస్సు విఱుగ గొట్టుటకై వేశ్య నొకదానిని బ్రయోగించి కృతార్థురాలయ్యెను. బాలుడు మాంచాలయెడ విముఖుఁడైనాడు. క్రమక్రమముగఁ దాను పెండ్లియొనర్చుకొనిన మాటనే మఱచెను.

ఇట్లుండ నొకనాఁడు నాయకురాలు మాచర్లను దోచు కొని వచ్చుటకై నరరూపరాక్షసులగు కొందఱాటవికులను బంపెను. ప్రసంగమూలమున కన్నమదాసు వారి యుద్య మమును గ్రహించి తన యసమాన బాహుబలమును వెల యించి దోపిడిగాండ్రను శరణాగతుల నొనరించుకొనుటయే గాక వారి వీపులపై నిసుకబస్తాలను గట్టించి యాలమందవలెఁ దోలికొనుచు గురజాల ప్రవేశించెను. ఈ యుదంతమును విని నాయకురాలు కన్నమనాయని నోటికివచ్చినట్లెల్ల ప్రేలెను. కన్నమనాయని కోపాగ్ని ప్రజ్వలించినది. కాని యానాటికి నాయకురాలెట్లో బ్రతికి బయటపడినది.

నిమిషమైనను దన్నెడబాసి యుండని కన్నమదాసు కన్పింపమికి లోలోన గుములుచు నిది నాగమ్మ మోసమై యుండునని నిశ్చయించుకొని బ్రహ్మన్న సపరివారుఁడై గురజాలకుఁ బయనమయ్యెను. ఈ సంగతి నెఱింగిన నాగాంబ మధ్యేమార్గమున బ్రహ్మన్న నంత మొందింప ననేక ప్రయత్నములు చేసినది. కాని యవి యన్నియును విఫలములైనవి. బ్రహ్మన్న సురక్షితముగ గురజాల జేరెను. అతఁడు నలగాముని గౌరవములకుఁ బాత్రుఁడై రాజుచే నుచిత మర్యాదలందెను. కాని నాగమ్మ మాత్రము తన వంచనోద్యోగమునం దప్రమత్తురాలై యుండెను.

---

## కోడిపందెములు

అవి సంక్రాంతి పండుగదినములు. అందును దెనుఁగు నాఁట నాకాలపు సంక్రాంతి దర్శనీయము. ప్రతి యింటను గాదెలనిండ ధాన్యము, కుండలనిండ పాడి, రైతుల శ్రమ ఫలించుటచే వారి గృహములు ధనధాన్య సంభరితములై యుండెను. మిరెపతోటలతోడను, బంతిపూలతోడను ప్రకృతికాంత నిజసౌందర్య ప్రకటీకరణమున వ్యగ్రమై యుండెను. గంగిరెద్దువాని పాటలు తెలుఁగుల వైభవమును, దానధర్మ నిరతిని గీర్తించుచుండెను. తెలుఁగు యువతులు రంగురంగుల ముగ్గులతోఁ దమ కళాభిజ్ఞతను వెల్లడించుచుండిరి. మరి తెలుఁగు వీరులో! వారి హృదయములందు వీరవినోదము

లుప్పొంగినవి. ఎటు జూచినను వినోదములే! ఎటుజూచినను గోడిపందెములే! వీరప్రదర్శనములే! ఆనాఁటి సంక్రాంతి వైభవము కోడిపందెముల రూపమున నేఁటికిని తెలుఁగునాట గతవైభవము ప్రదర్శితమగుచున్నది.

స్నానపానాదికములైన పిమ్మట బ్రహ్మన్న కొంత తడవు విశ్రమించెను. తదుపరి నాగమ్మ మనోవినోదమునకై కోడిపందెముల నేర్పాటుచేసి యా కుక్కుటయుద్ధమును వినోదమును దర్శించుటకై బ్రహ్మనాయని నాహ్వానించెను. హింసాప్రవృత్తితోఁగూడిన కోడిపందెముల వీక్షించుట బ్రహ్మనాయని కిష్టములేకున్నను, ఆహ్వానమును దిరస్కరించుట యుచితము కాదని యంగీకరించినాఁడు. నలగాముఁడును, బ్రహ్మన్నయు సపరివారులై యుచితాసనముల నుపవిష్టులైరి. వారి ప్రక్కనే యాసీనయై యున్నది నాగమ్మ.

కుక్కుటములు యుద్ధక్షేత్రమున విడువఁబడినవి. ప్రేక్షకులతోఁ గ్రిక్కిరిసి పోయిన దా క్షేత్రము. భారత కురుక్షేత్రము జ్ఞప్తి కెలయించిన దా రంగము. మహాపరాక్రమముతోఁ బోరుచున్న యా కుక్కుటము లానాఁటి యాంధ్రుల శౌర్యపరాక్రమ ప్రతీకములై యొప్పారెను. నలగామాదు లుత్సాహముతోడ నా యాహవమును వీక్షించుచుండిరి. నాగమ్మ బ్రహ్మనాయని ప్రక్కను బ్రవేశించి కయ్యమునకుఁ గాలుమవ్వ మొదలిడినది. బక్కచిక్కి ద్వంద్వయుద్ధమున నోడిపోవున ట్లున్న కుక్కుటము బ్రహ్మనాయని దనియు, మదించి పైపై కెగయుచున్న కుక్కుటము నలగామునిదనియుఁ బేర్లిడి

మాటిమాటికిని బ్రహ్మన్న నధిక్షేపించ మొదలిడినది. బ్రహన్న సహనశీలిగాన యామె మాటలఁ బట్టించుకొనక శాంతచిత్తుఁడై యా కుక్కుటాహవమును దర్శించుచుండెను.

అదేమి చిత్రమోగాని. బ్రహ్మన్న పేరుపెట్టిన కుక్కుటమే యధికపరాక్రమముతో నలగాముని కుక్కుటముపై కుఱికి దానిని నేలఁ గూల్చుచుండెను. ఈ విచిత్రమును దర్శించుచున్న ప్రేక్షకుల జయజయ ధ్వానములతో నాగమ్మ భరింపరాని యవమానముతోఁ గ్రుంగిపోవుచు బ్రహ్మన్నవైపునకుఁజూచి "ఎందుకట్లు గర్వించెదవు? నీ పేరు పెట్టిన కుక్కుటములు జయించుచున్నవనియేనా నీ యతిశయము? ఇంతమాత్రమునకే యింతటి గర్వమా? నీయందేమాత్రమైన పౌరుష మున్నయెడలఁ గాచికొమ్ము. రేపు మఱల పందెములు వేయుదుము. కేవల వినోదార్థము కాదుసుమా! కొన్ని షరతులకు లోఁబడి పందె మొడ్డుదము. పరాక్రమవంతుఁడవైనచో నే విధించు షరతుల కంగీకరించి పందెమునకు సిద్ధముకమ్ము. లేనిచో నాడుదానివలె మగిడి మాచెర్ల కేగు"మని యసూయాద్వేషము లుట్టిపడ పలికెను.

ఆమె మాటలను వినినాఁడు బ్రహ్మన్న. హింసామూలకమైన కోడిపందెము లాతనికిష్టములేదు. పైఁగా జూదమాడి రాజ్యభ్రష్టులై ఘోరవిపినముల కేగి యనేకములగు నిడుమలపాలైన ధర్మజుని వృత్తాంతమాతనికిఁ దెలియనిది కాదు. కాని యాతఁడు ధర్మజునివలెనే కోడిపందెములకాహ్వానింపబడినప్పుడు మొదటి కాదని తుద కొప్పుకొనెను.

ఎవరి కుక్కుటము మోడిపోవునో వారు తమరాజ్యమును త్యజించి యేడేండ్లరణ్యావాస మొనరింపవలెనను నియమము నేర్పఱచి నది నాగమ్మ. ఈ నియమము కేవలము వాఙ్మాత్రముగఁగాక లిఖితపూర్వకముగ నిరువురు నంగీకరించి చేవ్రాలిడిరి. గొల్ల గోపన్నను మధ్యవర్తిగ నెన్నుకొనిరి.

మఱునాఁడు కాలికి మువ్వలు, గజ్జెలు నలంకరించి కత్తులుకట్టి కుక్కుటములను యుద్ధభూమిని విడిచిరి. ఇరుపక్షములవారును శ్రద్ధతో నా కుక్కుటయుద్ధమును దర్శింపసాగిరి. ప్రేక్షకులతో నా ప్రదేశమంతయుఁ గ్రిక్కిరిసి పోయినది. ఆశ్చర్యము! జ్ఞానశూన్యములైన యా కుక్కుటముల కంతటి రోష మెచటినుండి వచ్చినదో? పరాజయమనిన వాటి కెంతటి యవమానము! మానవవీరులవలె నవియుఁ దీరని వైరముతోఁ బోరాడఁ దొడఁగినవి. తనపక్షపుఁ గుక్కుటములు క్రమక్రమముగ నశించుట గమనించి నాగమ్మ ఇఁక న్యాయయుద్ధమునఁ బరాజయము తప్పదని నిశ్చయించుకొనెను. అన్యాయముగనైనను బ్రహ్మన్న నోడించి మఱి దేవాదులతోఁగూడఁ బ్రవాసమునఁ గంపవలెనని యెంచి మఱియొక పుంజున కుక్కుకవచముగట్టి మోసమున బ్రహ్మనాయని కోడిపై వదిలెను. దానిచే నాయనికోడి యోడిపోయెను.

నాయకురాలొనరించుచున్న మోసమును గ్రహించినాఁడు గొల్ల గోపన్న. ఇది యన్యాయమని యభ్యంతర పెట్టెను. దానితో నాగమ్మ పక్షమును వహించిన మువ్వల గోపన్న లేచి నాయకురాలిని సమర్థించెను. వాగ్వివాదము

రేగినది, ఉభయపక్షములవారును యుద్ధమునకు సంసిద్ధులైరి. ఇంతలో శాంతమూర్తియగు బ్రహ్మనాయుడు లేచినాడు. ఉభయ పక్షములవారిని శాంతింపఁజేసెను. ప్రేక్షకులు బ్రహ్మనాయని యోరిమిని మెచ్చి యానందాశ్రువులు రాల్చిరి. ధార్మికుల కిట్టి విపత్తులు తప్పవుగదా యని సిద్ధాంతీకరించిరి. నాయకురాలి కుతంత్రమును బరికించి యేవగించుకొనిరి. బ్రహ్మనాయుఁడు సమయము ననుసరించి ప్రవాసమునకే సిద్ధమయ్యెను. మలిదేవాదులును నాతని మాట కెదురాడలేదు.

కన్నమదాసు ప్రవాసమునకు వలయు సన్నాహము లొనరించెను. పరివారమును వెంటఁగొని, వలయు వస్తుసామగ్రితోఁగూడ బ్రహ్మన్న మలిదేవాదుల వెంటఁగొని కృష్ణానదిని దాటి 'మందాడి' యను గ్రామమున నివాస మేర్పఱచుకొనెను.

---

# ప్రవాసము

బ్రహ్మన్నను మలిదేవాదులతోఁగూడ ప్రవాసమునకంపియు నాయకురాలు శాంతించలేదు. అచ్చటఁ గూడ వారిని గష్టముల పాలొనరించుటకై యామె యనేక ప్రయత్నము లొనరించి దుర్యోధనుని జ్ఞప్తికిఁ దెచ్చినది. ఆమె యెప్పటికప్పుడు చారులవలనఁ మలిదేవాదుల విషయమును దెలుసుకొనుచునే యుండెను. ప్రవాసములోఁగూడ వారు శాంతితో నిశ్చింతగ గాలము గడుపుచుండుటను విని యామె

యసూయ హద్దు మీఱినది. వారల నెట్లైన రూపుమాపవలె నని సంకల్పించి నలగామునితోడ సంప్రదింప నాతఁడు వల్లెయనెను.

వెంటనే నాగమ్మ ముష్కరులైన యాటవికుల రావించి మిక్కిలిగ సత్కరించి మలిదేవాదుల పశువుల బట్టి తెండని యాజ్ఞాపించెను. వారునుఁ జేతులు చఱచి సాయుధులై గోగ్రహణమునకై బయలుదేరిరి. భయంకర వేషధారులై రాత్రి సమయమున మందాడి ప్రవేశించి పశుశాల నాక్రమించిరి. ఈ శాల రక్షకుఁడైన లంకన్న నిదురనుండి యులికిపడి లేచి పశువులఁ దోలుకొని పోవుచున్న యాటవికులఁ జూచినాఁడు. ఎంతటి సాహసము! చూచుటయే తడవుగ నా నరరూప రాక్షసులపై విఱచుకుపడెను. చేతఁ గత్తి లేదు. సాముకఱ్ఱయే యాతని యాయుధము. తా నొక్కఁడు! శత్రువులా యసంఖ్యాకులు! పైఁగా వారు సాయుధపాణులు! ఎంత అనుపమాన సాహసముతో బోరినను రిపుబలాతిరేకత వలన లంకన్న వీరస్వర్గ మలంకరించెను.

ఈ యుద్ధకోలాహలమును విని కన్నమదాసు నిదుర నుండి మేల్కాంచెను. వీరరసావేశమున మేనుప్పొంగ మఱుమానిసినైనఁ బిలువక కత్తి చేతఁబట్టి యా ముష్కరుల వెంబడించినాఁడు. మేషసముదాయముపై కురుకు కొదమ సింగమువలె శత్రువులపై కురికి వారినెల్ల చెండాడి, యరుణోదయము గాకమున్నె పసువులఁ దోలుకొనివచ్చి యథారీతి కొట్టమునఁ గట్టివైచెను.

ప్రాతఃకాలమున బ్రహ్మనాయుఁడు నిద్రనుండి మేల్కాంచెను. అంతదనుక నాతనికి రాత్రి జరిగిన యుదంతమా వంతయు తెలియదు. తద్వృత్తాంతము శ్రవణగోచరముకాగా స్వామి భక్తిపరాయణుఁడై స్వామి హితమునుగోరి యసువుల నర్పించిన లంకన్న కశ్రుతర్పణమిచ్చె బ్రహ్మన్న. దిన దినమును నాయకురాలి యుపద్రవములకు గుఱియగుచు నింక నీఁట నుండుట శ్రేయస్కరము కాదని నిశ్చయించి పరివారముతో శ్రీశైలమునకుఁ బయనమాయెను. అట బంధు, మిత్ర పరివార సమేతుఁడై మల్లికార్జునస్వామిని దర్శించి యారాధించెను. అచటి మహీసురులకు భూరిదక్షిణ లొసంగి యాశీస్సులుగొని యొకచోఁ బటకుటీరముల నిర్మింపఁజేసి విశ్రమించెను. దినములు క్రమక్రమముగ గడచినవి. చేత నున్న విత్తమును నానాట దఱిఁగి పోయినది. ముందు కర్తవ్య మాలోచించినాఁడు. కష్టసమయములందు సామంతుల యొద్దకేగి చేయిఁజాపుట నైచ్యమని యెంచి సర్వసములును, పూజ్యులు నగు భిక్షావృత్తి స్వాములయొద్దకేగి సాష్టాంగప్రణామ మాచరించి పరిస్థితిని విన్నవించుకొనెను. అరివీరసంహారసమర్థమును, రిపుభయంకరమును, దనకుఁ బ్రాణతుల్యము నగు ఖడ్గమును కుదువ పెట్టుకొని కోటి నాణెముల ఋణ మీయవలసినదని ప్రార్థించెను. ప్రవాసానంతరము రాజ్యమున కేగిన వెంటనే ఋణమును దీర్తునని చెప్పగా, రాజ్యము నోడి యరణ్యములపాలై యున్న బ్రహ్మన్న కంతటి మొత్తము నప్పుగా నొసఁగుటకు పరి

వ్రాజకుఁడు భయపడెను. తన్నర్థించిన యంతటి మహా మంత్రిని రిక్త హస్తములతోఁ బంపుట కాతని మన మంగీకరించలేదు. చివఱ కా యతీశ్వరుఁడు వారచట నున్నంత కాలమును సుఖజీవనము గడుపుకొనుటకు వీలుగ కొన్ని గ్రామములు గుత్తకిచ్చి సమ్మానించెను.

ఆ పరివ్రాజకుం డొనర్చిన సాయమునకు సంతుష్టాంతరంగుఁడై బ్రహ్మన్న యటఁ గొన్నినాళ్ళుండి త్రిపురాంతకమున కేగెను. అచటఁ గొన్ని దినములుండి మాచర్లపురమున కేగి చెన్నకేశవస్వామి కాలయమును గట్టించి యటనుండి తఱలి మేడపి జేరెను. అచట మఠాధిపతి యొసంగిన గ్రామములలో వ్యవసాయవృత్తిచే గాలము గడుపుచుండెను. గడువు దాఁటినంతనే సపరివారుఁడై మాచర్లకుఁ బయనమయ్యెను.

---

# రాయబారము

బ్రహ్మనాయుఁడు మాచర్ల ప్రవేశించినతోడనే ప్రజలాతనికి సమధికోత్సాహముతో శుభస్వాగత మొసంగిరి. నాగమ్మపాలనమునఁ దా మనుభవించిన కష్టగాథలఁ జెప్పుకొని పరితపించిరి. వారి నందఱ నోదార్చెనాఁడు బ్రహ్మన్న. కాని, యుద్ధ మెపుడా యని యువ్విళ్ళూరుచున్నారు మాచర్ల వీరులు. అటు నాగమ్మయు నిశ్చింతగ నుండలేదు. ప్రవాసానంతరమైనను యుద్ధము తప్పదని గుర్తెఱిఁగినదిగావున యుద్ధ

మునకు వలయు సర్వసన్నాహము లొనర్ప మొదలిడెను. సేన నభివృద్ధి చేసినది. అసంఖ్యాకముగ యుద్ధ పరికరములఁ బ్రోవుచేసి, యుద్ధ మెపుడా యని యెదురు చూచుచుండెను. ఇటు మాచర్ల వీరులును యుద్ధమునకై త్వరపడసాగిరి. కాని బ్రహ్మన్న వారిని వారించి యొకపర్యాయము సంధికై రాయబార మంపుట యుక్తమని భావించి తగినవాఁ డెవ్వఁడా యని యాలోచించెను. శ్రీకృష్ణునివలె నుభయులకును గావల సినవాఁడుగాన అలరాజే తగినవాఁ డని నిశ్చయించెను.

అలరాజు కొమ్మరాజు కుమారుఁడు. ధీశాలి, ప్రజ్ఞా వంతుఁడు. అలరాజు పెదమల్ల దేవునకు మేనల్లుఁడు. నలగా మున కల్లుఁడు. అలరాజునకే రాచమల్లుఁడని బిరుదనామము. ఆతఁ డుభయపక్షములకు నాప్తుఁడు, మాటకారి, అన్ని విధ ముల రాయబారము నడుపుటఁ గర్హుఁడు.

బ్రహ్మనాయుఁ డలరాజుతో రాయబారమునకు వలయు మాటలఁ జెప్పి, యతని కే కీడును గలుగకుండఁ దన మెడలోని తులసిమాల నాతనికిచ్చెను. అలరాజా మాలను ధరియించి పయనమైనాఁడు. ఏ కారణముచేతనో తన తులసి మాల నిచ్చినందులకు దుఃఖించి మఱల నద్దానిఁ గొనిరమ్మని తనయుఁడైన బాలచంద్రున కాజ్ఞాపించెను. బాలచంద్రు డును రయమున నేగి యలరాజును సమీపించెనేగాని తులసి మాల నడుగుట కాతనికి మనసొప్పకుండెను. ఇంతలో వా రిరువురు నొక కాలువను దాటవలసివచ్చెను. బాలచంద్రున కొక యుపాయము తోఁచినది. గుఱ్ఱము నొక్క గంతులోఁ

గాలువను దాటించలేనివాఁడు తన యాభరణముల నిచ్చి వేయవలె నని పందెము వేసెను. ఈ పందెమున బాలుఁడే జయమొందెను. అంత రాచమల్లుఁడు తన యాభరణముల నన్నిటిని బాలున కిచ్చివైచెను. బాలుఁడందలి తులసిమాలను మాత్రము గొని గృహోన్ముఖుఁడై సాగిపోయెను.

అలరాజు గురజాలకు సురక్షితముగాఁ జేర నలగామరాజాతని నెదుర్కొని సమర్హ సత్కారముల నల్లుని నాదరించెను. విందులైనవి. నలగాముఁడు నిండుకొలువున్న తఱి ప్రారంభించినాఁడు రాచమల్లుఁడు. "రాజా! ప్రతిజ్ఞానిర్వహణపరాయణులై సప్తవర్షంబు లరణ్యావాసము సలిపి మలిదేవాదులు మగిడివచ్చినారు. రాజ్య ప్రవేశమునకై యధికారపత్రము గొనిరమ్మని నన్ను పంపినారు."

అలరాజుమాటలు విని నలగాముఁడు "అలరాజా! నీవు నా యల్లుఁడవై యుండియు శత్రుపక్షమునఁ జేరి వారి శ్రేయమునే కాంక్షించి రాయబారివై రాఁదగునా? అట్లొనర్చుటకు నీ యంతరాత్మ యంగీకరించినదా? నీ వింతటి యుక్తాయుక్తవివేకశూన్యుడ వగుదువని యెంచలేదు. రాజగౌరవలాంఛనములకుఁగూడ తిలాంజలి యొసంగితివి." అని పలికెను.

"మామా! నే నొనర్చిన పనియందిసుమంతయు దోసము లేదనియు, నిదియే శాంతికాముకుల విద్యుక్తధర్మమనియు నా యంతరాత్మ ప్రబోధించినది. మలిదేవాదులందధర్మము లేదు. ధర్మబద్ధమగు రాయబారమును నడు

పుటయం దాత్మగౌరవభంగమును కానరాదు. ఇఁక బంధుత్వ మందురా? నా కిరువురును సమానసన్నిహితులే? మీరు నాకుఁ బిల్ల నిచ్చుటచేఁ గొంత యాధిక్యత యున్నను, న్యాయయుతమై, సమస్త ప్రజామోదము నొందిన యీ కార్యమును నెఱవేర్చఁగూడదా? అట్లనుట భావ్యమా?" యని బదులిడెను.

ఈ మాటలు విని యుగ్రుఁడై నాఁడు నలగాముఁడు. నాగమ్మ యుపదేశము లాతనియందుఁ జక్కఁగ నాటుకొని యున్నవి. "అవును. మలిదేవాదులుగూడ నాతో సమానులే! శత్రువై మమ్ము ముప్పుతిప్పలు పెట్టుచున్న బ్రహ్మనాయుఁడు నీకు గురువైనాఁడు. నీవలె మే మింకను మానాభిమానముల విసర్జించలేదు. అన్యాయాభిమానమును మంటఁగలిపిన నీ ముఖముఁ జూడ మాకే సిగ్గగుచున్నది. ఛీ ఛీ! పొమ్ము" అని రోషభీషణాకారుఁడై పలికెను.

ఇంతవఱకును రాచమల్లుఁడు శాంతించియుండెను. ఇక నాతని తాల్మి పెల్లుబికినది. వెంటనే యాసనమునుండి లేచి నలగామునిపైఁ దీవ్రదృష్టులఁ బఱపినాడు. "నలగామా! నీవు బంధుప్రియుండ వనియు, యుక్తాయుక్తవివేకసంపన్నుఁడ వనియు, ధార్మికుఁడ వనియు నీ యింట నడుగిడితిని. కాని, యొక యాఁడుదాని చేతి కీలుబొమ్మవై యిట్టి నైచ్యమున కొడిగట్టి పతితుడ వైతివని యెఱుఁగనైతిని. నిజముగ దుష్టశీలుఁడవైన నీ ముఖము చూడరానిదే! సరే! సమస్త

వివాదములకుఁ బరిష్కర్తయైన భగవంతుడేఁ మీ వివాద మును దీర్చునుగాక!'' అని పలికి సభాభవనమును వీడెను.

సౌందర్యమూర్తియగు పేరమ్మ తనభర్త రాయబార మునకై వచ్చినాఁడన్న వార్త వినినది. దుర్భర వియోగ దుఃఖభారాక్రాంతయై యున్నయామె కీ వార్త యమృత ప్రాయమైనది. ప్రియుని దనమందిరమునకుఁ దోడితెచ్చి, వియోగదుఃఖవాహిని యొక్కసారి పొంగి పొరల నాతని శరీర మాపాదమస్తకమును ముంచి తేల్చుగోరి, యనునయ దీనాలాపములఁ బ్రార్థింప సమకట్టెను.

కాని, సంధిరాయబారములు భగ్నములగుటచే రాచ మల్లు తన భార్యకుఁగూడఁ జెప్పక యప్పటి కప్పుడే చెర్ల గుడిపాడు వెళ్ళెను. బ్రహ్మన్న కీ వార్తను దెల్పుట కాతనికి మనసొప్పదయ్యె. కన్నమదాసును బ్రహ్మన్నవద్దకుఁ బంపి తా నచటనే యుండిపోయినాఁడు.. ఆనాటి రాత్రియే నాగమ్మ యొక బ్రాహ్మణుని రావించి ద్రవ్యాశఁగల్పించి విషము బెట్టించి రాచమల్లును గూఢముగాఁ జంపించినది. ఆహా! ఏమి యీ నాయకురాలి దురాగతములు!

భర్త మరణవార్తను విని పేరమ్మ, నాయకురాలి నుద్దేశించి ''ఓసీ రక్కసీ! నీవు నా తండ్రిపాలిటఁ బిశాచమ వైతివి. వంచనోద్యోగమును బూని సోదరుల కెడబాటొన ర్చింతివి. ఆ బ్రహ్మన్న నీ కే మపకార మొనర్చినాఁడు? పరోత్కర్షను జూడజాలని నీవు నిజముగ రక్కసివే! చివఱకు నీకు నా పసుపుఁ గుంకుమయు భారమైనవి గాఁబోలు!

అందఱు నీవలెనే బాల్యవితంతువులై యిట్టి దుర్మార్గముల కొడిగట్టుకొనవలయుననియా నీతలంపు ? కానిమ్ము, దీనికిఁదగిన ఫల మనుభవింపక పోవు.'' అని తండ్రి నుద్దేశించి ''తండ్రీ! స్వభావసిద్ధముగ నీ వెంతయు దయాదాక్షిణ్యరతుఁడవు, న్యాయవిముఖుఁడవు కావు. కాని, సాంగత్యదోషమే నిన్ని ట్లొనర్చినది. నీ వన నెంత? ఆనాఁడు దుర్యోధనునంతటివాడే యట్లయ్యెను. నాపై నీ కింత వైర మేల? చిన్ననాఁటి నుండియు నన్ను బువ్వాలలోఁ బెట్టి పెంచినావే! కష్టించి విద్యాబుద్ధులఁ జెప్పించినావే! నేఁటికి నేను నీకు భారమైతినా? ఛీ! ఛీ! ఇఁక నే నిట నుండను. ఈ విషాదాంత నాటక మునకు సూత్రధారుఁడవై నీవే పుణ్యముఁ గట్టుకొనుము.'' అని పలవించి పతి ననుగమించినది సాధ్వి పేరమ్మ.

ఈ దుర్మరణములతో సంధిరాయబారములు పూర్తిగ విఫలములైనవి. యుద్ధము తప్పినది కాదు.

---

# సమరసన్నాహము

అలరాజు మరణవార్తను, పేరమ్మ పతి ననుగమించు టను వినిన మలిదేవాదుల దుఃఖమునకు మేరయే లేకుం డెను. యుద్ధ మనివార్యమైనది. బ్రహ్మనాయుఁడు వీరవిద్యా దేవి తృతీయపుత్రుఁడగు బాలమల్లదేవుని వీరమేడపికి రాజుగ నొనర్చి, తన పదవియందు బాలచంద్రుని నియమించి యున

పోతు నాతనికి సహాయకారిగ నియమించెను. అంతఃపుర రక్షణభారము మాడచి యను వీరవనిత వహించినది. బ్రహ్మనాయుడు విప్రుల రావించి ప్రయాణమునకు సుముహూర్తమును నిశ్చయింపఁజేసినాఁడు. వీరు లెల్లరును బ్రహ్మనాయని సమీపించి, తమ పరాక్రమముల నభివర్ణించి సమధికోత్సాహవచనముల బలుకఁజొచ్చిరి. బ్రహ్మన్న వారి నాదరించి తమకు సహాయులై వచ్చినవారి నందరను దృప్తులఁ గావించెను.

ప్రయాణదివస మేతెంచినది. రణభేరులు దిక్కులఁ బిక్కటిల్ల జేసినవి. రథ గజాశ్వ పదాతి దళంబులు ముందునకు సాగినవి. నారీమణులు మంగళహారతుల నిచ్చి వీరులఁ బుష్పమాలాలంకృతుల నొనర్చిరి. జయ జయ ధ్వానములతోఁ జతురంగబలములు ముందునకు సాగినవి. వీరి ప్రయాణోత్సవమును వీక్షించుచున్న దర్శకు లెల్లఱును రణోత్సాహపూరితులై కదనరంగమున కేగుచున్న పలనాటి వీరవరులనే జయలక్ష్మి వరించుఁగాక యని ప్రార్థింపఁ దొడఁగిరి.

బ్రహ్మన్న మధ్యేమార్గమునఁ ద్రిపురాంతకుని దర్శించి విధివిధానముగ స్వామి నర్చించినాడు. అచటనుండి గరికెపాడు మీఁదుగా మేళ్లవాగు చేరినాఁడు. అచటనే యుండి కన్నమదాసును గార్యమపురమున కేగి యచటి విశేషముల నరసి రమ్మని పంపెను. కన్నమదాసు కార్యమపురమునుండి మఱలివచ్చి నలగామాదు లింకను నచటికిఁ జేర లేదని యెఱిం

గించెను. అంత బ్రహ్మన్న సైన్యముతో ముందుకు సాగి. కార్యమపూడికిఁ జేరి విడిసినాఁడు. మాచెర్ల వీరులు యుద్ధ మెప్పుడా యని యెదురు చూచుచుండిరి. వారిని మెల్లగ నాశ్వాసించినాఁడు బ్రహ్మన్న. "వీరులారా! త్వరఁపడకుడు. మఱియొక సంధికై రాయబార మంపుదము. దానివలన మనకుఁ గలుగు గౌరవహాని లేదు. హింసానివారణకై యథా సాధ్యముగఁ బ్రయత్నించుట రాజధర్మము." అని భట్టుమూర్తిని బిలచి మఱల నలగామునియొద్దకు సంధిసందేశ మంపెను.

భట్టుమూర్తి నలగామునొద్ద కేగి "రాజా! నీవు ధర్మాధర్మవిచక్షణదక్షుఁడవు. సోదర కలహము మంచిది గాదు. జయలక్ష్మి యొకరినేగాని యిరువురను వరియింపదు గదా! సోదరుల నందఱఁ బరిమార్చిన తరువాత రాజ్యము వచ్చినను మీ యాత్మకు శాంతి యుండునా? కురుక్షేత్ర సంగ్రామానంతరము జయలక్ష్మిసమేతుఁడైనను ధర్మజుఁడు దాయాదుల మరణమునకై దుఃఖించి నిర్వేదంబు నొందుట తమకుఁ దెలియనిది కాదు. యుద్ధోపక్రమణము జననాశనము నకు మూలము. దేశవినాశమునకుఁ బ్రథమ సోపానము. ఐకమత్యము దేశౌన్నత్యమునకును ప్రజాక్షేమమునకును ముఖ్యసాధనము. కావున వారికి రాజ్యమునఁ బ్రవేశ మొసంగి యలుగుభూపాలుని యశోలతను వర్ధిల్లనిమ్ము" అని పలికెను.

నలగాముని కీతని మాటలు రుచింపలేదు. భ్రాతృ వైరమునకే యాతఁడు సిద్ధమయ్యెను. ఆహా! భరతమాతా! దూరాలోచనలేని భ్రాతృవైరములచే నీపుత్రు లెందరు మరణించిరోగదా! అసూయాద్వేషములచే సోదరులపైఁ గత్తి కట్టి సోదరుల హింసించుటతోఁబాటు నిన్నెన్ని పర్యాయములు విదేశీయుల కొప్పగించిరోగదా! తల్లీ! వివేకహీనులైన నీసంతానమువలన నీవనుభవించిన దుఃఖములఁ దలఁచుకొనిన నేఁటికిని మా గుండెలు వ్రక్కలగుచున్నవే! జననీ! దుర్మార్గులును, నసూయాపరులును, భ్రాతృప్రేమవిహీనులు నగు సంతతిచే నెన్ని యిడుమల పాలైతివోగదా! నేఁటికిని నీ సంతానమునకు జ్ఞానోదయ ముదయింపదాయెను. భ్రాతృ వైరములకుఁ దిలాంజలి యిచ్చి సోదరప్రేమకై వారి హృదయములు పరితపించుట లేదే? తల్లీ! ఏమి ఈ వైపరీత్యము!

నలగాముఁడు నాగమ్మ సలహాను గొని భట్టుమూర్తి హితవచనములఁ దృణీకరించుటయేగాక యాతని నోటికివచ్చి నట్లెల్ల ప్రేలినాఁడు. భట్టుమూర్తి యిఁక నిస్పృహఁజెంది బ్రహ్మన్నయొద్ద కేతెంచి సంగతి విన్నవించెను. యుద్ధ మనివార్యమని బ్రహ్మన్న నిశ్చయించుకొనినాఁడు. వీరవరుల నుద్దేశించి "ఓ వీరవరులారా! మీరు శాత్రవకాంతార వీతిహోత్రులరై లోకములు దిగ్భ్రమఁజెంద యరివీరులఁ జెండాడవలసిన తరుణ మాసన్నమైన"దని హెచ్చరించెను. వీరవిహార మొనర్చుటకై యువ్విళ్ళూరుచున్న వీరుల యుత్సాహమునకు మేఱలేదు.

తెల్లవాఱినది. ఉభయ సైన్యములును గార్యమపూడి యొద్ద విడిసినవి. నిజముగ నానాటి కార్యమపూడి భారతమునఁ గురుక్షేత్రపాత్రను దాల్చినది. నాగమ్మయు వీర తురగారూఢయై సమర రంగమున కేతెంచినది. రణోత్సాహులై రిపుభయంకరులైన శత్రుసైన్యముల నొకపరి వీక్షించినది. స్త్రీయగుటం జేసి నారీసహజమైన భయమామె నావరించగా యుద్ధకోలాహలమున కామె హృదయము వణఁకిపోయి ధైర్యము దిగజారినది. ఆమె నలగాముని సమీపించి యుద్ధవిరమణప్రయత్న మొనరించుటయే యుక్తమని విన్నవించుకొనెను. సహజముగ భ్రాతృవైరము లేనివాఁడు గావున నలగాముఁడు నందుల కంగీకరించినాఁడు. నాగమ్మ బ్రహ్మనాయనియొద్దకు సందేశమును బంపుటకు నిశ్చయించుకొని యా రాయబార కార్యనిర్వహణకు ధరణికోట ప్రభువైన కేతరాజే తగినవాఁడని యెంచెను. ధరణికోట భూపాలుని రావించి "రాజా! తాము బ్రహ్మనాయనియొద్ద కేగి నేఁజెప్పి పుత్తెంచిన చందమున 'మంత్రి మహాశయా! తాము పెద్దలు, ధర్మాధర్మ విచక్షణదక్షులు. మీకు నలగాముఁడును, మలిదేవాదులు నిరువురును సమానులే! ధార్మికులును, శాంతి కాముకులు నగు మీకు దీర్ఘకోపంబువలదు. మీరు కోరిన విధమున రాజ్యమిప్పించి మీ క్రోధస్థానమగు నరసింగ భూపతిని మీకు శరణాగతు నొనర్తుము. ఎట్లైనను సహోదరులం దైక్యభావము వర్ధిల్లఁజేయుము. మీరు దయాకంచలిత

హృదయు లగుటచే నాకోర్కె తప్పక నెరవేర్తురని యాశించు చున్నదాన''నని చెప్పు మని బోధించి పంపెను.

సహజముగ వైరమును గోరినవాఁడు కాఁడు కావున గేతరాజును యుద్ధవిరమణ కార్యనిర్వహణమునకై బ్రహ్మన్న యొద్ద కేగెను.

---

# బాలచంద్రుఁడు

ఇఁక నాహవరంగమును విలోకించు టొకింత సేపాపి మన దృష్టిని మాచర్లకు మఱల్చుదము. బాలచంద్రు డప్పటికి యౌవనదశయందున్నను బాల్యచేష్టలను మానలేదు. ఆటపాటలతోఁ గాలము వెళ్ళబుచ్చుచుండెను. అతనికిఁ జిన్ననాఁటినుండియు నాటపాటలన్న మక్కువ మెండు. అందును బొంగరము లాడుటయన్న యాతఁడు ప్రపంచమునే మఱచెడివాఁడు. అతనికి భార్యయగు మాంచాల విషయమే పట్టదు. తల్లి యెన్నియో మాఱులు చెప్పిచూచినది. చిన్నతనపు జేష్టలీయీడునఁ బనికిరావని బోధించెను. కాని బాలుఁడా మెమాటలను బెడజెవిఁ బెట్టెను.

ఒకనాఁడు బాలుడు తోడిబాలురతోఁ గూడి బొంగరము లాడుచుండెను. త్రోవను నీరు గొనితెచ్చుట కేతెంచిన పడతులుగూడ బిందెలఁ జంకన నిడుకొని యుత్సాహముతో బొంగరము లాటను జూచుచుండిరి. బాలుఁడు తన బొంగ

రమును గట్టిగ విసరఁగా ప్రమాదవశమున నది యొక
స్త్రీకిఁ దగిలి మఱలివచ్చి యట నిలువఁబడి వింతఁ జూచు
చున్న పడతులలో నొక తెయగు కోమటి యన్నమ్మ కాలికిఁ
దగిలి గాయమై రక్తము ధారలు కట్టినది. వెంటనే యామె
మూర్ఛిల్లెను. చుట్టుప్రక్కలనున్న మగువ లామె కుప
చారము లొనర్చి మూర్ఛ దేర్చిరి. వెంటనే యామె యపరి
మితమగు క్రోధముతో బాలునివంకఁ జూచి, "ఓయీ!
పందెపు గుఱ్ఱమువలె బలిసి యొడలెఱుంగక తిరుగు
చున్నావు. నీ తండ్రి బ్రహ్మనాయుఁడు దేశకళ్యాణమునకై
యాహవరంగమున కేగి శత్రువుల నుక్కడించుచుండ నీవు
పిరికిపందవై యాఁడువారిపైఁ బ్రతాపముఁ జూపుచున్నావు.
నీవంటి పుత్రు లున్న తల్లిదండ్రులకుఁ జక్కటి ప్రతిష్టయే
వచ్చును! బ్రహ్మనాయని కడుపునఁ జెడబుట్టితి"వని పరుష
వచనము లాడెను.

ఆ మాట లాలించి బాలుఁడు నిలువెల్లఁ గంపించి
వెంటనే యామె **పాదములపైఁ** బడి "తల్లీ! క్షమింపుము!
నిజముగ గర్తవ్యము నెఱుఁగక యిట్లు సోమరినై పోతిని.
నేటి నీ వచనములు నా కండ్లు తెఱచినవి. నేఁటినుండియు
నా కర్తవ్యమును బరిపాలించి, యరివీరులఁ జెండాడుట
యందు నా తండ్రికి సాయమొనర్తును. వెంటనే యుద్ధభూమి
కేగెద"నని ప్రార్థించి గృహాభిముఖుఁ డయ్యెను.

బాలుఁడు తిన్నగ నింటిదారిఁబట్టి తల్లియగు నైతాంబ
యొద్ద కేగి జరిగిన యుదంతమును బూసగ్రుచ్చినట్లు విన్న

వించెను. తదుపరి తన మనోగతాభిప్రాయ మెఱిఁగించి యుద్ధభూమి కేఁగుట కనుజ్ఞ నిమ్మని వేడుకొనెను. "నీ వాజ్ఞ నొసంగినచో . నాయనకుఁ దోడై శాత్రవుల కండకండలుగ నఱికి విజయలక్ష్మిని వెంటగొని వత్తు"నని చెప్పి యనుజ్ఞ నర్థించినాఁడు.

కుమారుని ముఖమున నితఃపూర్వ మెన్నఁడును విన నట్టి వీరపురుషోచిత వచనము లాలించి యైతాంబ యుబ్బి పోయినది. కాని, తన యేకైకపుత్రుఁడు తన్ను వీడి యుద్ధ మున కేఁగుటను దలఁచుకొనినంతనే యామె విషాదపరీత యయ్యెను. ఆమెలో మాతృప్రేమ జాగృతమైనది. ఎట్లయి నను బాలుని యుద్ధమున కేఁగకుండ నాపవలెనని సంకల్పించి నది. నెమ్మదిగ బాల్కు నుద్దేశించి "నీవు బాలుఁడవు. యుద్ధముం జేయ నసమర్థుఁడవు. యుద్ధము బొంగరములాట యని యెంచితివి కాఁబోలు ! బాల్యచేష్టలను మాను"మని హెచ్చరించెను. కాని దృఢనిశ్చయుఁడైన బాలుఁ డా మాట లను లెక్కగొనలేదు. ఏమైనను యుద్ధమున కేఁగక తప్పదని పట్టుబట్టెను. ఐతాంబ బాలుని భయపెట్టి వారించుచు నిట్లనెను.

"నాయనా!

పరరాజదళములు పైఁకొని రాఁగ
వాద్యసందోహంబు వడితోడ మ్రోయ
ఘనగజఘీంకారకలితమౌ రవము
నీనైన ఘోటకనిచయఘోషంబు

రథనేమిసంకులప్రబలశబ్దంబు
నమితమౌ పదతతియట్టహాసంబు
భేరీధమాముల ఘెళ్ళను మ్రోంత
యేకమై మించిన నెట్లు తాళెదవు?
విలుకాండ్రు చెలరేగి విచ్చలవిడిని
జడివాన పట్టిన చందంబు తోంప
దట్టమౌ శరవర్ష ధారలు గుఱియఁ
దప్పించుకొనలేవు ధైర్యంబు మీఱ" నని తల్లి యన
బాలుఁడు తల్లి వచనమునకు నిట్లని సమాధాన మొసంగెను.
"పుత్రమోహంబున బొంకెదుగాని,
యెఱుఁగవే నాబల మిందీవరాక్షి?
నలగామఁ డెఱుఁగును నాదు శౌర్యంబు
ప్రళయకాలమునాఁటి భైరవురీతి
సైంధవు సమయింప సమకట్టినట్టి
విజయుఁడు రణములో వెలసినయట్లు
కౌరవసేనలోఁ గదపట్టి దూఱి
వడముడి యనిలోన వాలినగతిని
వాయుపుత్రుఁడు లంక వడితోడఁ జొచ్చి
భస్మంబుగాఁ గాల్చి ప్రబలిన కరణి
రాక్షసగణముతో రామచంద్రుండు
వీరపరాక్రమవిధిఁ జెందినట్లు
జలధిమధ్యంబున సారెకుఁ దిరుగు
భూమి మందరనామ భూధ్రంబుపోల్కి—

గామభూపతి సేన గడగడవణఁక
విక్రమక్రమశక్తి విడివడఁ జొచ్చి
పృథ్విపైఁ బీనుగు పెంటలుగాఁగ" విహరింతు నని తల్లికి నివేదించెను. నన్ను బాలుఁడని భావింపవలదని యుద్ధమున కనుజ్ఞ యిమ్మని యర్థించెను.

ఇక లాభము లేదని గ్రహించినది తల్లి మైతమ్మ. తన యత్తగారైన శీలమ్మచేఁ జెప్పించినది. కాని బాలుఁడు పట్టు విడువలేదు. ఇంకొక విధమునఁ బ్రయత్నించి చూతమని యెంచి మైతమ్మ "నాయనా! సరే, నీ యభిమతము ననుసరించియే కానిమ్ము. కాని యుద్ధక్షేత్రమున కేగువారు తల్లి యాశీస్సులఁ గొనినపిమ్మట భార్య యనుమతినిగూడఁ దీసికొనుట యాచారము. కావున నీ భార్యయగు మాంచాల యొద్ద కేగి యామె యనుమతినిఁగూడఁ గొని యాహవరంగమున కేగుము. అది నీకు శ్రేయమును, జయమును నొడఁగూర్చు"నని పలికెను.

బాలచంద్రుఁడు జననిమాట లాలించి "అమ్మా! బహుదినములనుండి నే నామెను బరిత్యజించి, యామెయెడ నెంతయు నిరాదరముగఁ బ్రవర్తించితినిగదా! నే డామె యొద్దకుఁ గార్యార్థినై యేఁగిన నామె యెట్టి పరుషవచనము లాడునో గదా! ఆమెయొద్ద కేగుటకు మన సొప్పకున్న"దని తన హృదయస్థితి నెఱిగించెను.

అంత నైతమ్మ "నాయనా ! మాంచాల నీ వనుకొను నంతటి మూర్ఖురాలుకాదు. ఆమె విద్యావివేకసంపన్నురాలు. వయసునఁ బిన్నయయ్యు బుద్ధిసంపదయందు వయోవృద్ధుల మించినది. కావున నీవు సందేహింపక పొ"మ్మని కుమారు నొడఁబఱిచిపంపెను.

---

# వీరపత్ని

బాలుఁడు తల్లి మాటలను మన్నించి మాంచాల యొద్ద కేగుటకు సమ్మతించెను. బహుకాలమునకుఁ గోడలిని జూడఁబోవునప్పుడు రిక్తహస్తములతో నేగుట యుచితము కాదని యెంచి యైతాంబ ముద్దుకోడలికై బంగరు భూషణ ములను, బట్టు వస్త్రములను, బసుపు కుంకుమలను గొని పరి వారముతోఁ గూడఁ బాలుని వెంట గండువారింటి కేగెను.

బహుకాలమునకు వియ్యపురాలు తన యింటికి వచ్చు చున్న దనువార్త విని రేఖాంబ యెదురేగి యామెను గొని తెచ్చినది. ఉపచరించి పూజించెను. కుశలప్రశ్నలతోఁ గొంతకాలము గడచినది. అటు లామె తమ యింటి కకస్మాత్తుగ వచ్చుటకుఁగల కారణమేమో రేఖాంబకుఁగాని, యామె చెల్లెంద్రకుఁగాని యర్థము కాలేదు. తమవల్ల నేదైన యపరాధము గల్గెనేమో యని వారు భీతిల్లి యాగమన కారణము నడుగ లేకపోయిరి. చివఱకు రేఖాంబ యిట్లు

భయపడి మౌనము వహించుట యుక్తము కాదని యెంచి "వదినా! నేఁడు నీవు తోడికోడండ్ర వెంటనిడుకొని మమ్ముఁ జూడవచ్చుటచేఁ జాల సంతోషముగ నున్నది. వచ్చుచుఁ బోవుచున్ననేకదా సంబంధములు!" అని యుపక్రమించెను.

ఇంతలో మాంచాల గదిలోఁనుండి వారున్నతావున కేతెంచి గౌరవపురస్సరముగ నత్తలకు నమస్కరించి యొకచో నుపవిష్టురాలైనది. అందఱును వినుచుండ నామె నిర్భయముగ రేఖాంబతో "అమ్మా! అత్తగారు వచ్చిన కారణము మీరెఱుంగరు కాఁబోలును! నా భర్తగారు రణరంగమున కేగుట కుద్యుక్తులై యున్నారు. మార్గమధ్యమున నన్నుఁ జూచిపోవలయు ననియు, నా యనుమతినిఁ గొని వెళ్ళవలయు ననియు వచ్చుచున్నారు. వారింతదనుక నాయెడఁ జూపిన యలక్ష్యభావమునుగూర్చి నే నన్యథా తలంచి వారి నగౌరవపఱతు నేమో యని యెంచి హితోపదేశ మొనరించుటకై అత్తగారు వచ్చినారు." అని పలికెను.

ఈ మాట లాలించిన యైతాంబ—"తల్లీ! నీ వనిన మాటలు యథార్థము"లనెను. అంత మాంచాల యందుకొని "అత్తగారూ! భర్త యెంతటి యవినీతులై చరించినను సతికి భర్తయేగదా దైవము! నా భర్తగారు కారణాంతరమున నాయెడఁ గొంతకాల ముపేక్షాభావము వహించినను వారియెడ నే నాగ్రహముఁజూప నర్హురాలనా? తమ

యానతి ననుసరించి వారిని సగౌరవముగ యుద్ధక్షేత్రమున కంపెద''ననెను. ఈమాట లాలించిన మైలాంబ తానిక నేమిచెప్పినను ప్రయోజనము లేదనియు, మాంచాల వాగ్ధోరణియు యుద్ధమునకుఁ బ్రోత్సహించుచున్న దనియుఁ గనిపెట్టి మెల్లగ నటనుండి సెలవుగైకొని గృహమున కేగెను.

తల్లి వెడలిన కొలఁదిసేపటికే బాలచంద్రుఁ డత్తవారింటికి వచ్చెను. ఎన్నఁడును దమయింట నడుగిడని యల్లుఁడు నిరంతర వేశ్యాలోలుఁడై వివాహమైనదాది భార్యముఖారవింద మెట్టిదియో చూచియెఱుఁగని యల్లుఁడు ఎన్ని పర్యాయము లాహ్వానించినను శుష్కసమాధాన మొసఁగిన యల్లుఁడు నేఁ డత్తవారింటి కనాహూతుఁడై వచ్చెను. కాని, యతని మనమున నత్తవారేమని మందలింతురోయను జంకు నిండియుండెను. భార్య తన్నుఁ జూచి యేమని యెంచునోగదా యని యాతఁడు లోలోన బిడియ పడుచుండెను. కాని యాతని యాగమనము బందుగుల కానందము నిచ్చెను. గౌరవమర్యాదలు శతాధికములుగ జరుగుచున్నవి. విందులు మితిమీఱినవి. గ్రామములోనివా రందఱును కన్నమనాయని యల్లునిఁ జూచుటకై తండోపతండములుగ వచ్చుచుఁ బోవుచుండిరి.

రేఖాంబ తన సోదరీమణులచే మాంచాల కలంకారములు చేయించెను. పాపము! మాంచాల కీనాఁ డలంకారములు క్రొత్తలుగ నుండెను. పిన్నవయసునఁ దా నలంకరించుకొనినవి గుర్తులేవు. వివాహమైన నాఁటినుండియు

భర్తృవియోగమే! జీవితమునందలి ననుభవయోగ్యమగు కాలమంతయుఁ దిండిలేక, తగు వస్త్రములు లేక గడచి పోయెను. ఈనాడు నాథుఁడు ప్రత్యక్షమయ్యెను. ఆమె యానందము హద్దులు మీఱినది. అమూల్యాభరణములఁ దాల్చినది. పట్టువస్త్రముల ధరించినది. సుగంధతైల సంస్కార మొనరించి కురులు దువ్వుకొని పన్నీటఁ జలకమాడి కస్తూరి బొట్టు పెట్టినది. అనవరతము భర్తృప్రసాదమును ప్రసాదింపు డని కోటివేల్పులకు మ్రొక్కి మెల్లగా శయనాగారమును జేరెను.

బాలచంద్రుఁడును నత్తవారొసంగిన విందుల నారగించి శయనాగారమును జేరెను. అట భార్యయొక్క రూపురేఖావిలాసాదులఁ గాంచి యామె యొనర్చిన మర్యాదల స్వీకరించెను. సుగుణవతి యగు మాంచాల చూపించిన గౌరవప్రతిపత్తు లాతని హృదయము నాకర్షించినవి. తా నొనర్చిన యపచారమును దలంచి "అయ్యో! యిట్టి సౌందర్యతేజోవిలసిత యగు భార్యకు విముఖుఁడనై కేవల ధనాపహారణార్థము దగ్గరకుఁ జేరిన వేశ్యకు వశుఁడనైతినే! నే నెంతటి దౌర్భాగ్యుఁడను! పాప మీ శీలవతి నే నొనరించిన దారుణకృత్యమున కెంతటి హృదయవేదన నందినదో గదా! లోకమునం దపఖ్యాతికిఁ బాల్పడితిని. మిత్రుల పరిహాసమునకు గురియైతిని. తల్లిదండ్రుల కయిష్టుఁడనై వేశ్యాంగనచే ధనమానములఁ గోల్పోవుటయే గాక నామెచేతఁ దిట్లుపడితిని. ఈ విధముగా వ్యర్థుఁడనై నగు

బాటు పాలైతినే! ఆహా! నావలె వేశ్యాంగనాలోలురై యెందరు నిర్భాగ్యులు తమ జీవితముల నాశన మొనరించుకొనుచున్నారో! వారకామినీలోలురై యెందరు మూఢులు నావలె విలాస సౌశీల్యవతులగు భార్యలను విడచి వారి యుసు రంటఁగట్టు కొనుచున్నారో! వేశ్యాంగనాలోలురైన తమ భర్తల చేష్టలవలన నెంతమంది శీలవతు లవమానితలగుచున్నారో! ఎంతమంది మానవతులు దుర్భరదుఃఖమును భరింపజాలక యాత్మహత్యలకుఁ బాల్పడుచున్నారో! హిందూ ధర్మమా! ప్రపంచమునందలి ధర్మములకెల్ల తలమానిక మనఁదగు నీయం దిట్టి దురాచారములా! ఇకనైన వేశ్యావృత్తికి స్వస్తియొసంగరాదా?'' యని తన పూర్వస్థితిని తలంచుకొని పశ్చాత్తప్తుం డయ్యెను.

మాంచాల భావజ్ఞురాలు. భర్తృ ముఖలక్షణములను బట్టియే యాతని పశ్చాత్తాప భావమును గుర్తించెను. ''గత జలసేతుబంధన మేల? అందువలనఁ బ్రయోజన మేమి? నా యదృష్టము బాగున్నచో నికమీఁద సుఖింపఁగూడదా?'' యని మనసును సమాధానపరచుకొని సమయోచితముగ వినయవచనములతోడను, భక్తిపురస్సరమైన సపర్యలతోడను నాతని మనసును లోఁగొన్నది. బాలుఁడు ప్రసన్నుఁ డయ్యెను.

ఇప్పుడాతనికి వేశ్య జ్ఞప్తియందు లేదు. బొంగరము లేమైనవో తెలియదు. కార్యమపూడి కదనరంగ మేమైనదో మరచెను. మిత్రులేమయిపోయిరో తెలియదు. రాత్రిం

బగళ్లు మాంచాలతోడనే కాలము గడచిపోవుచున్నది. బాలుఁడు పూర్తిగ నిజభార్యాలోలుఁ డయ్యెను.

యుద్ధమువిషయము మాంచాలకు జ్ఞప్తియందున్నది. కాని పాప మేమి చేయఁగలదు? యుద్ధగమన కర్తవ్యము నుద్బోధించినచో భర్త యేమనుకొనునో! ఐనను దినములు గడచుచుండుటచేఁ గార్యము మించిపోవుచున్న దని యామె సాహసించి యుద్ధ విషయమును జ్ఞప్తి కెలయింపఁదలఁచెను. భోజనము లైనపిదప నాథుని బడకటింటికిఁ గొంపోయి యాకు మడపు లిచ్చి యాటపాటల వినోదింపఁజేసెను. చిత్రశాలకుఁ గొంపోయి యటనున్న వీరగాథలతోఁ గూడిన యనేక చిత్రములఁ జూపి వీరుల రణవిహారముల నభివర్ణించి క్రమముగ నభిమన్యుని చిత్రమునొద్దకుఁ గొంపోయెను. ఉత్తర, యభిమన్యుని యుద్ధసన్నద్ధు నొనరించి హారతి నిచ్చి ఖడ్గము నొసగి రణరంగమున కంపుచున్న దృశ్యమును వారిద్దరు కొలఁది కాలము వీక్షించి పరస్పర ముఖావలోకన మొనరించి నిట్టూర్పులు పుచ్చిరి.

అదే సమయమునకు బాలుని మిత్రులైన తాంబవలన బాలుని యుద్ధప్రయాణమును విని మహాసంరంభముతోఁ గన్నమనాయని యింటియొద్ద కేతెంచి బాలు నాహ్వానించిరి. మిత్రులు బాలుని యుద్ధసన్నద్ధుడ వగుమని హెచ్చరించిరి. బాలుడు యుద్ధమున కేగ ననుజ్ఞ నిమ్మని మాంచాల నర్థింప మాంచాల—"నాథా! పోయిరండు. మన భోగము లెక్కడకును బోవు. వీర పురుషులకు ...



ప్రాణులై యరికులారణ్య విచ్ఛేదన మొనరించి జయలక్ష్మీ సమేతులై వచ్చిననాఁడుగదా మన నిజమగు ఆనందము. ఆనాఁడేగదా లోకులు మనల నభినందించుట. ఆనాఁడేగదా నాకు వీరపత్ని నగు భాగ్య మబ్బినది. నీ యవక్రపరాక్రమ సాహసాదులఁ జూపించి మలిదేవాదులకు రాజ్యభాగ మిప్పింపుము. మల్లికార్జునుఁడును, జన్న కేశవస్వామియు నన్ను రక్షించి, జయ మొసంగుదురుగాక! నీవలన పలనాటి వీరుల ప్రతిష్ట నల్గడలను వ్యాపించుఁగాక!'' యని హారతి నిచ్చి జయమాలవైచి వీరగంధముపూసి ఖడ్గమందించి వీడ్కొలిపెను.

---

## బాలవీరులు

మాంచాలయొద్ద సెలవుగైకొని బాలచంద్రుఁడు పయనమయ్యెను. మాంచాల తన భర్తమిత్రుడగు యనపోతును వ్రేలితో నిర్దేశించి ''ఈతడు బ్రాహ్మణ బాలుని వలె దోఁచుచున్నాఁడు. యుద్ధరంగము వీరాధి వీరులతోఁ గూడి భయంకర హింసాప్రవృత్తితోఁ నిండియుండును. అచట నేమి ప్రమాదము వాటిల్లునో! నీవు బ్రహ్మహత్యా పాతకముఁ దెచ్చిపెట్టుకొననేల? ఏదియో సాకుచెప్పి యాతనిని దిగవిడచి పొ''మ్మని తెల్పెను. అంత బాలుఁడు ''మాంచాలా! నిజముగ నతఁడు బ్రాహ్మణుఁడే! నాబహిః

ప్రాణము. నన్ను విడచి క్షణమైన నుండడు. ఇతఁడు పిరికి పంద కాడు. యుద్ధములనిన వెనుదీయువాఁడునుగాఁడు. అతని నిప్పు డెట్లు వారించుట ?'' యని ప్రశ్నించెను. అందుల కామె కొంతతడ వాలోచించి ''దీని కొక యుపాయమున్నది. కొంతదూర మేగినతరువాత ముత్యాలహారమును ముద్దు టుంగరమును మాంచాలకడ మఱచివచ్చితిని, వెంటనే నీ వేగి కొని తెమ్మని పంపుఁడు. నే నేవో మాటలతోఁ బ్రొద్దు పుచ్చెదను. ఇంతలో మీరు ముందునకు సాగిపొండు. అతఁడు మీ రేగిన త్రోవ తెలియక వెనుదిరిగివచ్చు''నని చెప్పెను.

బాలుఁ డట్లేయని పయనమైపోయి, త్రోవలో నొక శమీవృక్షముకడ నాగి ''అనపోతూ! మన ప్రయాణపుఁ దొందరలో నా పచ్చలపతకమును, ముద్దుటుంగరమును మాంచాల మందిరములో మఱచి వచ్చితిని. నీవుదక్క నితరు లెవ్వరును బోరాదు. మే మిచటనే నీకై వేచి యుందుము. నీవు శీఘ్రగతినిబోయి గొని తె''మ్మన నా మర్మము నెఱుఁగని యనపోతు బాలుని మాటలు నమ్మి వెడలిపోయెను. అతఁడు వెళ్లిన పిమ్మట నతనిపేర యుద్ధమునకు రావలదని తన యానగా నొక లేఖవ్రాసి యొక యశ్వత్థ తరువునకు వ్రేలఁగట్టి మిగిలినవారితోఁగూడ బాలుఁడు కార్యమపూడి చేరెను.

మఱికొంత సేపటి కనపోతు తిరిగివచ్చి మిత్రులను గానక నలువైపులను కలయఁజూచి యశ్వత్థ వృక్షమునకుఁ గట్టిన లేఖను గాంచి విప్పిజదివెను.

"శ్రీగిరీశునియాన, చెన్ననియాన
మలిదేవరాజాన, మాతండ్రియాన,
యర్వదార్గురు వీరులందఱియాన,
త్రోసి వచ్చితివేని ద్రోహ మంటెడును.
బాలుని మిత్రుల ప్రాణంబులకును
దప్పినలాగౌను దరలితివేని.
ఆనలు మీఱుట యది నీతి గాదు
తన సంగడీలతోఁ దరలె బాలుండు.
సాహసమ్మున నీవు సాగి రాఁగూడ" దని యున్నది.

దీనిని జదివిన యనపోతు దుఃఖమునకు మేరలేదు. మిత్ర వియోగమునకు కడు వాపోయెను.

"జంటనౌ నను వీడ ధర్మమా నీకు ?
మంచితనంబున మన్నించి నన్నుఁ
బొమ్మన్న పనులకుఁ బోయితిఁగాని.
తప్పానవా లని తలఁపంగనైతి.
నీనాతి మాంచాల, నీపొందుకత్తె
హాస్యంబుజేసిరి యానవా లెఱిఁగి
వెంగలినైతిని వెలమలవద్ద
బ్రాహ్మణు డీతండు బవరంబు చూచి
భయపడునంచును భావించినావె ?

బ్రాహ్మణమరణంబు పాపం బటంచుఁ
జనినావె దయమాలి సర్వజ్ఞ చంద్ర!
ధర్మ శాస్త్రంబు బారి నీకెఱుక
తమ నేలినట్టి యా ధరణీశుకొఱకు
సమరంబులోపలఁ జచ్చినయపుడు
పాపంబు గలుగదు, బలిమిని బట్టి
ఖండించివైచినఁ గలుషంబు వచ్చు;
ద్రోణుండు కృపుఁడును ద్రోణసుతుండు
సమరంబు సేయరా సాహస మొప్ప?
గురువైన ద్రోణుండు గూలె యుద్ధమున
నేమనుష్యున కంటె నెట్టి కిల్బిషము?
వీరవిక్రమయుద్ధవిభవంబు గాంచు
భాగ్యంబు లేదాయెఁ బాపిని నేను''

అనుచుఁ గొంతతడవు దుఃఖించి, వీరమేడపినుండి వీరులవద్దకుఁ గార్యమపూడి కేగుచున్న మాడచి యను గొల్ల పడుచును గాంచి ''మాడచీ! ఇంతవరకును బ్రాణమునకుఁ బ్రాణమైయున్న నన్నువీడి మిగిలిన స్నేహితుల నందఱ గొని బాలుఁడు యుద్ధమున కేగినాఁడు. సోదరునికి యుద్ధమునఁ దోడ్పడని నా యీ శరీరమున్న నేమి? లేకున్న నేమి? ఇవి నా మాటలుగ నా యన్నతోఁ జెప్పి, యానవాలుగ వీని నతని కిమ్మని మహావేశమునఁ గత్తితోఁ బొడుచుకొని యా వేడినెత్తుటఁ దన యజ్ఞోపవీతమును దడిపి మాడచి చేతియం దుంచి ప్రాణముల వీడెను.

ఆహా! ఏమి యాతని మిత్రవాత్సల్యము! మిత్రత్వమున కాదర్శమైన దీతని చరిత్ర. నిరంతరవిద్యాప్రియుఁడును, నిరాడంబరుఁడును, సతతసత్కార్యాచరణపరాయణుఁడును, శమదమాది సద్గుణ శోభితుఁడును నగు ననపోతు చరిత్రము మఱువరానిది. ఇట్టి శుభలక్షణలక్షితుని మరణము మనలనే విషాద సాగరమున ముంచుచుండ నాతని తల్లిదండ్రులును, బాలచంద్రుఁడును, మిత్రులును నెంతగ దుఃఖించిరో గదా!

---

# సందేశము

నాయకురాలి యాజ్ఞను శిరసావహించి కేతరాజాదులామె సందేశమును బ్రహ్మానాయనియొద్దకుఁ గొని తెచ్చిరి. వారి నందఱ నుచితముగ సాదరించినాఁడు బ్రహ్మన్న. అంతఁ గేతరాజు బ్రహ్మన్నదిక్కు మొగంబై "మంత్రిసత్తమా! నీవు జ్ఞానవయోవృద్ధుఁడవు. రాజనీతికుశలుఁడవు. వైష్ణవభక్తాగ్రేసరుఁడవు. సమస్తనీతికుశలుఁడవు. సర్వజ్ఞుఁడవు. భవదీయా ప్రతిమానప్రతిభా విశేషములు లోకమునకు సుపరిచితములు. నీ వార్తత్రాణపరాయణుఁడవు. శాంతమూర్తివి. నలగామాదులు మీయెడ నొనర్చిన యపచారములు మే మెఱుఁగుదుము. నరసింగరాజుపై మారుకత్తి గట్టిన విషయము మాకవగతమే! అలరాజును జంపినందులకు నలగామాదులపై మీకుఁగోపమును, బ్రతీకార వాంఛయు

నుండుట సహజమే ! యుద్ధమే శరణ్యమని యెంచుట యుభయ పక్షములకు ననిష్టదాయకమగుటం జేసి యుద్ధోద్యమమును విరమింపుఁడని ప్రార్థించుచున్నాము. అట్లొనర్చి రేని దిగంత విశ్రాంతకీర్తి నార్జించినవా రగుదురు. లోకమును నంతసించును. మీరు యథావిధి మాచర్లను బాలించుకొనవచ్చును. మీరిరువురు నైకమత్యముతో నుండి రేని పగతురు మీవంకఁ గన్నెత్తి చూచుటకైనను సాహసింపఁజాలరు. ఆచంద్ర తారార్కముగ మీ యుభయరాజ్యములు వైభవోన్నత ములై విలసిల్లఁగలవు. బ్రహన్నమంత్రి ! అట్లైనఁ బలనాటి రాజుల పరిపాలనా విధానము చరిత్రాత్మకమై లోకాదర్శం బగును. స్వర్గ మలంకరించిన యలుగురాజు నాత్మకు శాంతి చేకూరును. ఓ సచివాగ్రణీ ! అలుగుఁరా జవసానసమయ మునఁ దన కుమారుల నీ చేతులలోఁ బెట్టినాఁడు. ఉభయు లును మీకు సమానులే ! జరిగిన దేదియో జరిగినది. గడచిన వానిని ద్రవ్వుకొని ప్రయోజనములేదు. ఇంతటితోఁ గక్షల విసర్జించి సర్వసముఁడవై నీ వీ యుభయుల కైకమత్యమొడఁ గూర్చి శాశ్వతమైన కీర్తినార్జించి మా కానందము జేకూ ర్చుము. నరసింగరాజును గొనివచ్చి మీ పాదములపైఁ బడ వేసి శరణ మనిపించెదము. శరణాగతరక్షకుఁడ వని మేటి బిరుదు వహించిన నీ వాతనిని క్షమింతు వని మా విశ్వాసము. కావున మా మొఱ నాలించి సంధికార్యనిర్వహణసమర్థుడవు కమ్ము'' అని విన్నవించెను.

అతని సందేశమును సావధానముగ విని బ్రహ్మనా యుడు "ధరణీకోటాధిపా! యుద్ధమువలన సంభవించు నసర్థము మే మెఱుంగనిది కాదు. జన ధన నాశనమునకును లోకాపవాదమునకును వెఱచియే ధర్మబద్ధులమై యొకటికి రెండు పర్యాయములు రాయబార మంపితిమి. కేతరాజా! మే మొనర్చిన పనియందేమేని లోపము కలదా! జననాశన మునకును బంధు నాశనమునకును మేముమాత్రము వాంఛింతుమా? మేము శాంతము వహించినను శత్రుత్వము వహించిన ప్రత్యర్థు లూరకుందురా? శాత్రవులు మా పైకి విజృంభించినపుడే మేము మా యొరలనుండి కత్తి దూయుదుము. కాని, కయ్యమునకుఁ గాలుద్రువ్వుట మాపనిగాదు. శత్రువులు మాపైఁబడినపుడే మా శౌర్యసాహసములఁ బ్రదర్శించి విజయయశోలక్ష్మి నార్జింతుము. లేదా వీరస్వర్గ మలంకరింతుము. ప్రస్తుత యుద్ధమున మే మే గెలుతుమని విఱ్ఱవీగుట లేదు. జయాపజయములు దైవాధీనములు", అని యింకేమో చెప్పఁబోవుచుండఁగనే శిబిరద్వారముచెంత నేదియో యలజడియయ్యెను.

సరిగ నదే సమయమున బాలవీరుల వెంటనిడుకొని త్రోవ నిమ్మని కేకలిడుచుఁ జేరినాఁడు బాలచంద్రుడు. కాని, యచట నీతని మాట వినిపించుకొనువా రెవ్వరు? అందఱును సంధిరాయబారములఫలిత మే మగునా యని యాందోళనతో నుండిరి. బాలచంద్రుఁడు వారల నతిక్రమించి సభామధ్యమునఁ బ్రవేశించెను. బాలుఁడగుటచే నాతని రాక వారికి నచ్చలేదు.

రాజుగూడ తన యనిష్టమును బ్రకటించుచుఁ బెడమొగముఁ బెట్టెను. కన్నమదాసు లేచి "పసివాఁడవు, యుద్ధ మనిన భీతిలేక, తండ్రియాజ్ఞ నుల్లంఘించి, విధించిన కార్యముల విడచిపెట్టి యుచ్ఛృంఖలముగ నిటకు రాఁ దగునా?" యని మందలించెను.

బాలచంద్రుఁడు కన్నమదాసుని మందలింపులను లెక్కగొనలేదు. ఇటు కేతరాజాదులు బ్రహ్మనాయని యామాత్రపుమాటలకే తమ గాయబార ప్రయత్నములు సఫలమైనట్లు భావించి ప్రశంసింప మొదలిడిరి. ఆ క్షణమున జనుల చిత్తవృత్తులొక విధముగ లేవు. వీరులైనవారు తమ యాయుధములకు వలసినంత పనిలేకపోవుచున్నదిగదా యని చింతించిరి. భీరులు సంధిప్రయత్నములు సఫలమైనచో మఱల వెంటనే గృహములకేగి యాలుబిడ్డలఁ జూచుకొనవచ్చును గదా యని సంబరపడసాగిరి. సభాసదుల ముఖలక్షణముల వీక్షించి వారి మనోగతాభిప్రాయముల గ్రహించి బాలుఁడు నిర్భయముగ మలిదేవునిదిక్కు—"ప్రభూ! ముక్కాకలు తీఱిన వీరయోధులతో రణరంగమున కేతెంచి యిప్పుడు భీతిల్లి సంధిప్రయత్నము లొనరించుచున్నారా? శాత్రవసేనా నివహంబుల వీక్షించినంతనే మఱల నాలుబిడ్డలను జూడగల్గుదుమో లేదో యను సంశయం బొదవినదా? స్వరాజ్య సంపాదనార్థమై యరివీరుల నాహవరంగమునఁ జెండాడుట యధర్మమని తోచినదా? వీరుల యాయుధంబులు మొక్కవోయెనే? ఇదియే మీ కర్తవ్యమైనచో నింతదూరము

రానేల! వీరుల కింతటి శ్రమ నీయనేల? ఆహవరంగమునఁ జొచ్చి శాత్రవశోణితస్రవంతుల మజ్జనం బాడవలయుఁగాని యాఁడువారివలె నధైర్యపడుట వీరోచిత కార్యమే! జయాప జయంబులు దైవాధీనములే యగుఁగాక! అరివీర సంహార మొనరించి నిజరాజ్య లాభము నొందుట, లేదా వీరస్వర్గ మలంకరించుట—ఈ రెండేగదా వీరులకు నిశ్చిత మార్గములు! మీ రీరెంటిని బరిత్యజించి మధ్యమార్గ మవలంభింపనేల? యుద్ధమునఁ గావలసినంత పని లభించునుగదా యని గంపెఁడాశతో వచ్చితిని. ఇదియేనా మీ క్షాత్ర తేజము? ఇదియేనా మీ పరాక్రమము?" అని పలికి నాయని వీక్షించి—"తండ్రీ పద్మనాయక వంశమున జనించి నీవును సంధికి సమ్మతించితివా? జన్మలో భయమనున దెఱుంగనివాఁడవుగదా! అట్టి నీవే సంధి కియ్యకొనఁ జూచుచున్నావా? నాయనా! నాగాంబ యొనరించిన యత్యాచారములకుఁ బ్రతీకార మొనర్ప నెంచి ప్రాణములపై మోహమును వీడిన యసంఖ్యాకులైన వీరుల వెంటనిడుకొని వచ్చి జయలక్ష్మినిఁ జేపట్టకుండ రిక్తహస్తములతో మఱలింతువా? తండ్రీ! నీ సంధిరాయబారములతో నాగాంబ యొనరించిన మహాపకారములచేఁ బీడింపఁబడిన మాచర్ల యోధుల క్రోధాగ్ని చల్లారునే? భిక్షుకులవలె నలగామరాజునొద్దను, నాగమ్మయొద్దనుఁ జేయిఁజాచి భిక్షాప్రార్థన మొనరించి తృప్తిం జెందుట పద్మనాయక వీరవంశార్హమగు కార్యమే! దీని వలన మాచర్ల వాసుల మనములు శాంతిని బొందునే!

జనకా! ఇదివఱలో నలగాముఁడును, నాగమ్మయుఁ బెట్టిన బాధలను, తిట్టిన తిట్లను కేతరాజు మాట్లాడిన నాలుగుమాటలకే మఱచితిరా? సంధికై మనము పంపిన యలరాజును రహస్యముగఁ జంపించిన విషయము స్మృతిపథమునుండి తొలఁగిపోయినదా? అలరాజు హత్యకై వారల ప్రాణములపహరింపకున్న మనకు సుఖమున్నదే! నోటికి వచ్చినట్లెల్ల ప్రల్లదము లాడిన నాగమ్మనాలుక నుత్తరింపక మనసులు శాంతించునే! భ్రాతృవైరమూని సహోదరుల నంతమొందింపఁ జూచిన నీచుల రూపుమాపవలదే! ఈ గృహకలహమునకును, భ్రాతృవైరమునకును, రాజవిద్రోహమునకును మూలమైన నాగమ్మ జీవించియుండ మాచర్ల పౌరులెట్లు సుఖింతురు? మన కూఱట యెక్కడిది? అన్నియు మఱచి సంధిప్రయత్నములా? ఈ తరుణమున మగతనమును వీడి వెనుకంజవేసిన నలుగురును నగిపోరా? రణమన్న భయపడినచోఁ నిక్కడనే యుండిపొండు. నేనొక్కఁడనే ఖడ్గమాత్రసహాయుఁడనై యరివీరులఁ జెండాడి వీరగౌరవమును రక్షింతును. నేనును యుద్ధవిముఖుఁడనైనచో భావిచరిత్రయందు మన మాచర్లకు స్థానమేది? బ్రహ్మనాయుని తనయునివల్లనే పలనాటిసీమ ప్రతిష్ఠ భారతచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁబడుఁగాక! తండ్రీ! నన్ను పిన్నవాఁడని యెంచక, పుత్రవ్యామోహమును గణింపక యాశీర్వదించి యుద్ధమున కనుమతింపుఁడు. మఱలి వత్తునా జయలక్ష్మీసమేతుఁడనై వత్తును. విజయాంగన

మార్గోమిడెనా, రిక్తహస్తములతో నీ బాలచంద్రుఁడు మఱలి రాఁడని విశ్వసించుఁడు'' అని మేఘగంభీరస్వరమున బల్కెను.

బాలుని యీ వాక్యములు బ్రహ్మనాయని కాశ్చర్యముఁ గలుగఁజేసినవి. కుమారునినోట నిట్టి వాక్యములు మున్నెన్నఁడును వినియెఱుంగఁడు. బాల్యచేష్టలతోఁ గాలముఁ గడుపువాఁడేగాని యింతటి పౌరుషశాలియని యనుకొనలేదు. జలదగంభీరస్వరమునఁ గుమారుఁడాడిన వీరవాక్యము లాలించిన యా తండ్రి యానందమునకు మేరలేదు. క్రిందటి క్షణమువరకును సంధి ప్రయత్నముల మునింగియున్న యాతని హృదయమున కిదియొక తీవ్రాఘాతము. భావికర్తవ్యమును గూర్చి యాలోచించ మొదలిడెను.

ఇంతలో ననపోతు పంపిన నెత్తుటి జందెమును, కాలి కడియమును గొనివచ్చిన మాడచి యచటి కేతెంచెను. ఆనవాలును బాలుని చేతియందుంచి, యనపోతు మరణవార్త నెఱింగించెను. బాలచంద్రుఁ డది విని, రక్తసిక్తమైన యజ్ఞోపవీతముం గాంచి—''అయ్యో! మిత్రమా! నే నొనర్చిన యపరాధమున కెంతటి దారుణశిక్ష నొసంగితివి'' యని దుఃఖభారాక్రాంతుఁడై మొదలు నఱికిన చెట్టువలె నేలఁ గూలి మూర్ఛిల్లెను. పరిసరములందున్న జను లాతని యాకస్మిక మూర్ఛకుఁ జకితులై కారణ మేమని మాడచిని బ్రశ్నించిరి. మాడచియు జరిగిన యుదంతము నామూలాగ్రముగ నివేదించెను. ఈ దుఃఖగాథ నాలకించి యచటి జనులు

కన్నీరు గార్చుచు బాలునికి శైత్యోపచారము లారం భించిరి. కొంతవడికి బాలుఁడు తెప్పరిల్లి "వయస్యా! ఎంతటి దారుణకృత్య మొనర్చితివి? నే జేసిన యపరాధ మున కింతటి దారుణమగు శిక్షయా? నే నొనర్చిన కార్యము సవార్థ మొనరించుకొంటివా? నీ విట్లు చేతువని కలనైనను దలంచలేదే మిత్రమా! నీవు బ్రాహ్మణుఁడవనియు, యుద్ధ మున నీ కేదైనఁ బ్రమాదము వాటిల్లిన బ్రహ్మహత్యా పాతక మంటుననియుఁ దలంచితినేగాని నీతో వైరమూనివచ్చి తినా? నీ వింటి కేగి సుఖముగ నుందువనియు, జయలక్ష్మీ సమేతులమై వచ్చిన మ మ్మాహ్వానించి శ్రమబాపుదువనియు నెంచితినిగాని యింతటి సాహస మొనరింతువని యెంచనైతినే? అయ్యో! నే నెంతటి దురదృష్టవంతుఁడను! ఏ బ్రహ్మ హత్యాపాతకమునకు వెఱచి మిత్రుని వీడివచ్చితినో, యా పాతకమే సంప్రాప్తించినదిగదా!" యని పరిపరివిధముల దుఃఖింపసాఁగెను.

అంత చుట్టుప్రక్కలనున్న వీరు లాతని నూఱడింపఁ సాగిరి. మిత్రవియోగాగ్ని యుపశమనవాక్యములతోడను, సానుభూతితోఁ గూడిన యశ్రుబిందువులతోడను జల్లారునది కాదుగదా! కొంతవడి కెట్లో యాతని హృదయమున శోక భారము తగ్గెను. కాని, దాని స్థానమును కోప మాక్రమించి క్షణక్షణాభివృద్ధి నొందెను. శాత్రవు లొనర్చిన దుండగముల వలనగదా తన మిత్రరత్న మసువుల గోల్పోవలసి వచ్చినది! ఈ యుపద్రవముల కన్నిటికిని నాగమ్మయేగదా మూలకార

ణము ? అట్టి నాగమ్మను నలగామునితోఁగూడ నరకమునకుఁ బంపకున్న నా మిత్రుని యాత్మకు శాంతి యెక్కడిది ? రక్తసిక్తమై బ్రాహ్మణ పౌరుషమును వెడలఁగ్రక్కుచున్న యీ యజ్ఞోపవీతము శత్రుసంహార మొనర్పుమని నన్ను బ్రబోధించుచున్నది. అరివీరసంహారమే నా ప్రస్తుతకర్తవ్యము'' అని నిశ్చయించుకొనెను.

అతనిశోక మాగ్రహము నినుమడింపఁజేసినది. ఉద్రిక్తుడై చటాలున లేచి యొరనుండ కత్తిదీసి వీరులను సంబోధించి—''ప్రాణములపైఁ దీపియు, సంసారముపై వ్యామోహమును వీడలేనివారిచోఁ బ్రయోజనములేదు. భీరులును, పౌరుషహీనులును మాత్రమే యిట్లు సంధిరాయబారముల తోడను, సంప్రదింపులతోడను గాలమును వ్యర్థపుత్తురు. అట్టివారి నిచటనే యుండనిండు. వారు శాత్రవులకు దోసిలొగ్గుదురు. పాపము, మీ రందరును ప్రభువిశ్వాసపరాయణులగుట శాత్రవుల విషప్రయోగములును, నీర్ష్యా స్వభావములును, కుట్రాలోచనలును మీ యంతరాత్మను స్పృశించుటలేదు కాఁబోలును. మీ రందఱు నిచ్చటనే యుండుఁడు. మీ సంప్రదింపులు పూర్తికాకమునుపే శాత్రవవంశనిర్మూలన మొనరించి వత్తును. ఆ శాత్రవవీరుల జెండాడుటకు నే నొక్కడనే చాలుదు''నని రోషపూరితుఁడై పలుక సభ్యులెల్లరును వీరావేశపరవశులైరి. యువకుల వీరహృదయము లుప్పొంగెను. అప్రయత్నముగ వారి కరములు కరవాలములపైఁబడెను. వీరులు జయనాదము లొనర్చిరి.

తన పుత్రుని యావేశపూరిత వాక్కుల నాకర్ణించిన బ్రహ్మనాయనికిఁగూడ కొంత యుద్రేక ముదయించెను. సంధి ప్రయత్నముల కాతఁడుగూడ విముఖుఁడయ్యెను. కోట రాజాదు లాతని ముఖలక్షణములబట్టియే కార్యము శ్రుతి మించి రాగమునఁ బడినదని గ్రహించిరి. బ్రహ్మన్నయు నిఁక సంధి పొసగదని విస్పష్ట మొనరించినాఁడు. కోటరాజు బాల చంద్రుని శాంతింపఁజేయుటకై విశ్వప్రయత్నము లొన రించెను. కాని యాతని ప్రయత్నములు నిష్ఫలములైనవి. అంత వారు నిస్పృహచెంది బ్రహ్మన్నవద్ద సెలవుగైకొని నల గామునియొద్ద కేగి జరిగిన వృత్తాంతమును విన్నవించిరి. నలఁగా ముఁడును చేయునదిలేక యుద్ధసన్నాహము లొనర్పసాగెను.

---

# ఆహవము

కేతరాజాదులు వెడలిపోయినంతనే బ్రహ్మన్న తన వీరులను గాంచి "మీ మీ ప్రయత్నములలో నప్రమత్తులరై యుండుడు. రేపే రణయజ్ఞము ప్రారంభ మగు"నని హెచ్చ రించి వారిని దమ తమ శిబిరముల కేగుమని యాజ్ఞాపించెను. తరువాత మలిదేవాదులతో "ఇది యిట్లెందుకుఁ బరిణ మించెనో చెప్పఁజాలను. మీరును యుద్ధసన్నద్ధులై యుండుఁ"డని చెప్పి తనయుని దోడ్కొని శిబిరములోని కేగెను. ఒక పర్యాయము తనయునివంక సాభిప్రాయముగ జూచి "ఈ బాలచంద్రుఁ డా బాలచంద్రుఁడు కాఁడు. అతఁడు

కేవలము బాలుఁడు. ఇతఁడు శౌర్యమూర్తియగు యువకుఁడు. అతని కాట పాటలందే ధ్యాస. ఇతనికి సంగ్రామమునందే మనసు. ఇరువురి మనోవృత్తు లందెంత వ్యత్యాసమున్న" దని తలచెను.

మఱియొకపఱి చూచి బ్రహ్మన్న తన పౌరుషమునకుఁ బ్రతిబింబమును, దన శౌర్యమునకుఁ బ్రతీకమును, తన యభిమానమునకుఁ బ్రతిరూపమునగు కుమారుని జేరదీసి యక్కునఁ జేర్చి యానందబాష్పములచే నభిషిక్తు నొనరించినాఁడు. పుత్రునివలనఁ దండ్రి యాశించునట్టి యానంద మీనాఁడు లభించినది బ్రహ్మన్నకు. ఆనాఁడెల్ల నస్త్రశస్త్ర ప్రయోగముల నెఱిఁగించి రణనీతి నుపదేశించెను. బాలచంద్రుఁడును దండ్రి యుపదేశములెల్ల ధారణసల్పి సతతాభ్యాసముచేఁ గాని యలవడని యుద్ధపాండితి నొక్కనాఁటిలో గ్రహించెను.

ఉభయ పక్షములవారును దమ తమ యాయుధముల తోడను, నానావిధ రణవాద్యముల తోడను, రథ, గజ, తురగ, పదాతులతోడను యుద్ధరంగమునఁ జొచ్చిరి. బాల చంద్రున కెచటను గాలు నిలుచుటలేదు. ఆహా! ఏమి యా రణోత్సాహము! నిజమనోరథంబుల మిత్రసమక్షమున వ్యక్త మొనరించుచు, వీరుల కుత్సాహము కలిగించుచు నెటు చూచినను నాతఁడేయై కాన్పించుచుండెను. బాలుని సాహస మును జూచి బ్రహ్మనాయుఁడు మధ్య మధ్య మందలించుచు నాహవరంగ విధుల నుపదేశించెను. తండ్రి యొనర్చిన యుప దేశముల శ్రద్ధాళువై యాలకించుచు బాలుఁడు కదనరంగ మున విజృంభించెను.

భేరీపటహానినాదంబులును, వందిమాగధుల జయజయ ధ్వానములును దిక్కుల బిక్కటిల్లఁజేయుచు వీరుల రణోత్సాహము నినుమడింపఁజేయుచుండెను. ఉభయసేనల యందలి సైనికులును దమకు సరియగు జోడు నెన్నుకొని యుద్ధమునకుఁ దలపడిరి. బ్రహ్మనాయుఁడు కత్తిబట్టి కదనరంగమున కుఱికెను. ఇఁక నాతని కత్తి కెదు రేది? నలగాముని సైన్యముపై మేకలపై దుముకు సింగమువలె గర్జించుచు నుఱికినాఁడు బ్రహ్మనాయుఁడు. ఆహా! ఏమి యా పరాక్రమము! అతని ఖడ్గప్రహారమునకుఁ దిరుగులేదు. కంటఁబడినవారి శిరముల నెల్ల దూరమున బడునట్లేయుఁ దొడంగెను. బ్రహ్మనాయని నెదుర్కొన శాత్రవులు సాహసింపలేకుండిరి.

అదుగో! మన బాలచంద్రుఁడు. బాలుడు శాత్రవదళంబుపై విజృంభించినాఁడు. ఎంత చిత్రము! శాత్రవుఁ జూచిన నాతని మే నిట్లుప్పొంగి పోవుచున్న దేమి? అదుగోల భుజము లుప్పొంగ చక్రభ్రమణములతోఁ గన్నవారిని గని నంతనె నేలఁగూలఁద్రేయుచున్నాఁడు. ఆహా! ఏమి యా యుద్ధనైపుణ్యము! బొంగరములాడు నాచేతి కంతటి రణకౌశల మెట్లబ్బినదో! బాలచంద్రుని ఖడ్గమున కెఱయైన శిరము లాకసమున నెట్లు విహరించుచున్నవో! అవి నిజముగ మానవశిరములా లేక బాలుఁడు బొంగరములాడుట మాని కందుకక్రీడ మొదలిడెనా! కాదు, నిజముగ శిరములే! అవిగో నేలఁ బడుచున్నవి! అతని ఖడ్గసంచాలనమున

కీఁక నిలుపుదల లేదు గాఁబోలు. అతఁడు పగతుఱ మస్తకములతో బంతులాడుచున్నాఁడు. బాలచంద్రుని చుట్టును రణరంగము పీనుఁగు పెంటలతో నిండిపోయినది. అదిగో! నాగులేరు వీరరక్తముతో నిండి ప్రవహించుచున్నది. బాలుని వీరవిహారమున కెదురులేదు. వీరులా వీరమూర్తికి జోహారులొనరించుచున్నారు.

నలగాముని పక్షమువారిలో నొక యోధుఁడు గజారూఢుఁడై బాలుని కెదురైనాఁడు. పోలికయందు భేదము లేకపోవుటచేతఁ గాబోలు నరసింగభూపతి యని భ్రమించి తొలుదొల్తఁ నా గజశిరచ్ఛేదన మొనరింప పాప మా యోధుడు నేల కొరిగెను. వెంటనే బాలుఁడు వాని శిరంబును దెగవేసి, యా శిరంబును చేతఁగొని తన పక్షమువారి కక్షి వీనివధతోఁ దీరిపోయినదని సంతసించుచుఁ దండ్రియొద్దకుఁ బరువెత్తెను. బ్రహ్మనాయుఁడు యుద్ధనిమగ్నుఁడై యుండెను. బాలచంద్రు డాతనియొద్ద కేగి—"తండ్రీ! మన కాగర్భశత్రువైన నరసింగుని వధించితిని. అతని శిరంబిదిగో" యని తండ్రికిఁ జూపెను. బ్రహ్మన్న యది నరసింగరాజు శిరము కాదనెను. అంత బాలుఁ డా శిరము నచటనే జారవిడచి మఱల శత్రుమధ్యంబునకు దుమికెను. ఇత్తరి నిజముగ నరసింగుడే యెదురయ్యెను. బాలవీరుని వీరవిహారముఁ జూచి భయాక్రాంతులై శాత్రవవర్గములోని యనేకులు పలాయనమంత్రముఁ బఠించిరి. నరసింగుఁడు పలాయితుల నుద్దేశించి "యో వీరులారా! పగతురకు వెఱచి పలాయితులగు

చుంటిరా? నరసింగుఁడు మీ వెంటనంటి యుండ మీ కేటి భయము? మఱలుఁడు, రండ"ని, హెచ్చరింపసాగెను. నరసింగుని యుత్సాహవచనము లాలకించి వీరులు మఱల వెనుక కేతెంచి యుద్ధమొనర్పసాగిరి..నలగాముని పక్షములోఁ జాలమంది బాలుని ఖడ్గమున కెఱయైరి.

తన బలంబు క్షీణించి పోవుటజూడ నరసింగునికిఁ గ్రోధ మధికమయ్యెను. అతఁ డుద్రిక్తుఁడై బాలునిపై కి విజృంభించెను. కాని ఫలితమేమి? బాలుఁడు మత్తగజము పైకి లంఘించు సింగపుఁ బిల్లవలె నరసింగ రా జెక్కిన ఏనుఁగుపై నొక్కదాటులో లంఘించి, చివాలున నాతని శిరముత్తరించి దాని నొక బల్లెమున గ్రుచ్చి తన స్కంధావారమును బ్రవేశించెను. మలిదేవుని సైనికులెల్ల నరసింగ రాజు శిరముంగాంచి పరమానందభరితులై బాలవీరు ననేక విధముల నభినుతించిరి. బాలుఁడా శిరమును గొంపోయి తండ్రికిఁ జూపెను. దానిని జూచినంతనే బ్రహ్మనాయ నికి విచారమును, గోపమును నొక్కసారిగ నావరించెను. బాలచంద్రుఁని దారుణకృత్యమే యాతని కోపకారణము.

అనుగురాజు సంతతిలో బ్రహ్మనాయనికి నరసింగ రాజుపై బ్రేమ యధికము. నరసింగరాజును తల్లిదండ్రుల యొద్దకంటె బ్రహ్మనాయనియొద్దనే యెక్కువ చనువుతో మెలగెడివాఁడు. అతనికి బ్రహ్మనాయనియెడ బితృభావము. బ్రహ్మన్న కాతనియెడఁ బుత్రవాత్సల్యము. అందుచే నాతని యీ దుర్మరణమునకుఁ గటగటంపడి యుగ్రుఁడై బాలుని

జూచి—"ఓరీ! కఠినహృదయుఁడా! ప్రభునిశిర ముత్తరించి నామెప్పు లందుటకై వచ్చితివా? ఎట్టి యకార్యము నొనర్చితివి? మన పరాక్రమములను ప్రభువులమీఁదనా చూపుట! ఇంతటి యుద్ధక్షేత్రమున నీ పరాక్రమమును జూపుటకు వీరులు కఱవైపోయిరా? ఇన్నిదినములనుండి వారి యుప్పుదిని వారినే మన చేతులతో సంహరించుట యైనది. ఇంతకంటెను వేఱు విశ్వాసఘాతముండునే! వారికూడుగుడిచి, వారిబట్ట కట్టి తుద కిట్టి కిరాత కృత్య మొనరించిన మనలను లోకము నిందింపకుండునే? తరతరములుగ నీ కళంకము లోకుల కాలోచనా విషయము కాకుండునే!" యనుచుఁ బుత్రుని నిందించెను.

"తండ్రీ! ఏల మీరి ట్లకారణముగ నన్ను నిందించెదరు? లోకము నిందించుననియా మీభయము? యుద్ధమున నడుగిడినతరువాత, వీరు శాత్రువు లని నిర్ధారణమైన పిమ్మట, నొరలనుండి కత్తులు బయటి కేతెంచిన వెనుక, ఉభయ పక్షములందును సైనికు లసంఖ్యాకముగ మడసిన తదుపరి శత్రుసంహారమునెడఁ దారతమ్య పరీక్ష నేల సేయవలెనో బోధపడకున్నది. కత్తిఁబట్టి కదనరంగమున కుఱికిన తరువాత శాత్రవబలములోఁ ప్రభువైనను బంటైనను చేతి కందినవాని నెల్లఁ జీల్చి చెండాడుటే వీరకృత్యము. మనమే వారికిఁ జిక్కితి మనుకొనుఁడు. వారు మనల విడుతురా? రాయబారియై వెళ్ళిన రాచమల్లును విషప్రయోగముతోఁ జంపించిన నరసింగరాజు తల ఖండించినందులకు విజయగర్వముతో

జయడిండిమము మ్రోయించుటకు మాటుగ నీ వికృత ప్రసంగము లేల? ఇన్నియనర్థము లొనరించి యీ మహాహావమునకుఁ గారణభూతుఁడైన యీ నీచు నిట్లు వధించుటలో పాపమిసుమంతయు లేదని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఎవరే మన్ననుసరే, నిశ్శేషముగ శత్రునిర్మూలన మొనరించినఁగాని యుద్ధమును విరమింపను'' అని యావేశముతోఁ బల్కి తండ్రి ప్రత్యుత్తరమునుగూడ వినకుండ యాకలిగొన్న బెబ్బులి యాలమందలపై కుఱికినట్లు శత్రుసేనలపైఁబడెను.

నలగాముని పక్షముననున్న యోధానుయోధులెల్ల నరసింగరాజు నంతమొందించిన బాలచంద్రు నెట్లయిన వధించితీరవలెనని పట్టుపట్టిరి. వారందఱు నేకమై యొక్కమ్మడి చుట్టుముట్టి, కుంతలములు విసరియు, కత్తులఁ జిమ్మియు నతనికి విరామమిడక నొప్పింపసాగిరి. రిపు సైన్యముల జిందరవందర గావించుచున్న బాలుని పద్మవ్యూహమున నభిమన్యు బంధించినరీతి యోధులందరేకమై చుట్టుముట్టిరి. సమరోత్సాహమినుమడింపఁ దన ఖడ్గమునకుఁ జాలినంత రిపు వీర రక్తము దాహశాంతిగ నిడుచు యుద్ధనైపుణ్యము ప్రకటించుచుండెను. ఇంతలో వైరులొక్కుమ్మడిగ నధర్మ కదనమునకు బాల్పడి బాలవీరు నంతమొందించిరి. లోకోత్తర వీరుడగు నాబాలుని చరిత్ర యాదిలోనే సమాప్తిమయ్యెను.

కురుక్షేత్రయుద్ధమున నభిమన్యుడెట్లు వీరవిహారము సల్పి తుదిలో పద్మవ్యూహమునందవిలి మడిసెనో పలనాటి

రణరంగమున బాలవీరుడగ్గై యంతమొందెను. కావుననే పల్నాటి చరిత్రకు పలనాటి భారతమను నామము సార్థకము. ఈ దారుణవార్త క్రమముగ బ్రహ్మనాయని చెవినిబడెను. పుత్రమరణమును వినినంతనే బ్రహ్మనాయుఁడు దురంతరంబైన చింతాహతిని వైరాగ్యమూని సేనానాయకత్వము కన్నమదాసున కప్పగించి తా నస్త్రసన్యాస మొనరించెను.

అప్పటికే యిరుపక్షములందసంఖ్యాకులైన వీరులు మడసిరి. శత్రుసేనలో మిగిలియున్న వారిలో ముఖ్యులు నలగామరాజు, కేతరాజు. ఇటువైపు వారిలో ముఖ్యులు బ్రహ్మనాయుఁడు, కన్నమదాసు, గండు కన్నమనాయుఁడు, పేర్నీడు. బాలచంద్రుని మరణవార్తను విని బ్రహ్మన్న పుత్రశోకమున నస్త్రసన్యాస మొనరించినను గన్నమదాసు మాత్రము వెనుకంజవేయలేదు. శత్రు నిర్మూలన మొనరించి స్వామిపగ సాధింపవలెనని యాతఁడు కృతనిశ్చయుఁడై యుండెను. ఈ భారతమున కంతకును గారణభూతురాలైన నాగమ్మను చీల్చి చెండాడుదనుక శాంతియెక్కడ. ఆ మహావేశముతోడనే కన్నమనాయుఁడు మున్నగు వీరయోధులఁ బురికొల్పుకొని, వీరాంజనేయునిపగిది నరివీరులపై కుక్షికి శాత్రవశిరోమాలికల వినువీథుల దోరణము కట్టుచుఁ బ్రళయకాలరుద్రునిభంగి నాగమ్మపైఁబడి యామెను బ్రాణములతో బంధించి గొని తెచ్చెను. నాయకురాలు పట్టుబడినంతనే నల

గాముని యుద్ధోత్సాహ మడుగంటెను, వెంటనే యాతఁడు తన శిబిరమున కేగి యొక్క వేడి నిట్టూర్పు పుచ్చెను. నల గాముఁడు యుద్ధక్షేత్రమును వీడుటతోడనే మిగిలిన సైన్యము చిన్నాభిన్నమై పలాయనమయ్యెను.

---

# నిర్వేదము

ఈ రక్తపాతమునకుఁ హేతుభూతురాలైన నాగమ్మ చేఁజిక్కినది. ఉభయపక్షములందలి వీరులకును నామెపై నాగ్రహమే గలిగినది. ఇంతటి జనక్షయమున కొడిగట్టిన పాపాత్మురాలు బంధితురాలైనది. ఆమె ముఖమున వెనుకటి యహంకార మెక్కడను బొడసూపదు, వెనుకటి దర్పమేమూల దాగెనో కానరాదు.

రణప్రసంగమున కాశ్వాసాంతమైనది. కన్నమదాసామెను వెంటనిడుకొని బ్రహ్మన్న యొద్దకుఁ బయనమయ్యెను. మలిదేవుని సైనికు లందఱును, నాయుఁడు నాయకురాలి కెట్టి శిక్ష విధించునా యని తహతహ లాడుచుండిరి. నాయకురాలు పట్టుబడుటతో మాచర్లవీరులకుఁ గలిగిన యుత్సాహమునకు మేరలేదు. వీరాధివీరులఁ బొట్టఁ బెట్టుకొనిన నాగమ్మ పట్టుబడుట యన సామాన్యవిషయము

గాదు. చిరకాలమునుండి మాచర్లవీరుల మనమున మండు చున్న ప్రతిక్రోధాగ్ని నాఁటితో శాంతించినది.

బ్రహ్మనాయుఁడు శిబిరమునుండి వెలుపలికివచ్చి యుద్ధ భూమిని దృష్టి సారించగనే యాతని కన్నీరు మున్నీరుగా ప్రవహింపసాగెను. ఆ భీభత్సదృశ్యముతో నాతని మేను జలదరించినది. హృదయము కంపించినది. నిట్టూర్పు నిగిడించి యిట్లని చింతింపదొడగెను—"అయ్యో! ఎంతఘోరము జరిగినది; దైవవిలాస మిట్లున్నది గాఁబోలు! ఈ జనక్షయ మునకు యీ యుద్ధమునకు బర్యవసాన మేమి? పుత్రులను, మిత్రులను, బాంధవులను పొట్టఁబెట్టుకొని నేనుమాత్రము జీవించి యున్నాను. శత్రువుల గతి యేమైనది? నరసింగ రాజును, అప్పలను రణరంగమున కాహుతి నొనర్చి నలగా ముడుఁ మాత్రము జీవచ్ఛవమై మిగిలియున్నాఁడు. మఱి నాగమ్మ! బ్రతికినన్నాళ్ళును సుఖమనున దెఱుంగక, తృప్తికిఁ దిలాంజలి యొసంగి మహాత్వాకాంక్షకు లోనై, మిథ్యాగర్వమున విఱ్ఱవీగినది. ఆమె తన చర్యలకుఁ బొందిన ఫల మేమి? దీనయై, మహత్వహీనయై బందీయైనది. అయ్యో! ఎంతటి జననష్టము! ఎంతటి ధనవ్యయము! ఈ యుద్ధమువలన నిరువురిలో నే యొక్కరును సుఖించినవారు కారే? విజయమందితినన్న సుఖము లేదు గదా నాకు. ఈ విజయ మెవరికొఱకు? ప్రభువును మూల్యముగ నొసంగి

కొని తెచ్చిన యీ విజయ మేల? కుమారుని బలియొసంగి విజయగర్వము నెట్లు పొందుదును? ఆప్తుల నందఱ నాహవ రంగమున బలి యొసంగి విజయమునకై యానందించుటెట్లు? పర్యవసాన మిట్లుండునని తలంచియే మొదటినుండియు శాంతి నపేక్షించితిని. ఒకసారిగాదు, తుదివరకు శాంతిసందేశమంపి సంధికై ప్రయత్నించితిని. కాని, యీ మాయలాడిఁ ఆ జిత్తుల మారి, పలనాటిసీమకు, మహామారియగు నా నాగమ్మ వినినది కాదు. ఆమె మాటలకు వశుఁడై నలగామఁ డామె యాడించిన ట్లాడినాఁడేగాని ముందు వెనుక లాలోచించనే లేదు. అతఁడు నామాట నంగీకరించి సంధి కీకొనియున్న చోఁ బలనాటిసీమ సుఖసమృద్ధితో నుండెడిదిగదా! అందఱను రణయజ్ఞమున బలి యొసంగి నలగామఁడును, నేనును దుఃఖ భారముతోఁ గ్రుంగిపోవుట తప్ప బొందిన దేమి? ఓడి పోయిన నలగామునకు సుఖము సున్న. జయించిన నాకును శాంతి యేది? యుద్ధానంతరము ధర్మజునకుఁ బట్టిన చింతయే నాకును బట్టినది.'' అని పరిపరివిధముల వాపోవఁ దొడంగెను. ఇంతలో నిర్బంధములో నున్న నాయకురాలిని గొని వచ్చి బ్రహ్మన్నముందు నిలువఁబెట్టి, కన్నమదాసు చేతులు కట్టుకొని ప్రక్క కొరగిలి నిలబడి యుండెను.

బ్రహ్మనాయుఁడామెవంకకుఁ జూచెను. ఆ చూపులలోఁ గ్రోధము నసహ్యము తాండవించుచున్నవి. యుద్ధ రంగమున నస్తవ్యస్తములై పడియున్న మృతకళేబరములను

రక్తస్రవంతులను జూపుచు—"నాగమ్మా! ఇదిగో నీ మహత్వాకాంక్షకును, విద్వేషమునకును ఫలము! ఇదియే నీ కుతంత్రములకును, నీ పరాక్రమమునకును బ్రతిఫలము! ఇప్పటికైనను నీకడుపు చల్లారినదా?" యన నాగమ్మ మాఱుమాట లేదు.

కన్నమదాసు మాత్రము నాగమ్మకుఁ దగిన శిక్ష విధించవలె నని ప్రార్థించెను. అంత బ్రహ్మనాయుఁడు—"కన్నయ్యా! నాగమ్మను విడువుము. భారతధర్మము మహిళావమానమున కంగీకరింపదు. ఒక యబలను జయించుట కేనా మన పౌరుష ప్రదర్శనము! నీ యభీష్టమంత సమంజసము కాదు. ఇం దీమె యపరాధము లేదు. ఇది యంతయు విధివిలాసము! విధి యనుకూలుఁడు గాకున్న చో నీనాగమ్మయే గాదు వేయిమంది నాగమ్మలైనను నిట్టి దారుణమునకుఁ గారణభూతులు కాలేరు. కావున నీమెను విడిచిపుచ్చుము" యనెను. కన్నమదాసు మఱుమాటాడక నాయకురాలి బంధము లూడఁదీసెను.

బ్రహ్మనాయుఁడు దయార్ద్రహృదయుఁడు. శాంతమూర్తి, క్షమాశీలి, యహింసావ్రతుఁడైన వైష్ణవభక్తాగ్రేసరుఁడు. కావుననే పలనాటి భారతమునకుఁ గారణభూతురాలైన నాగమ్మను క్షమించి విడచినాఁడు. ఇది బ్రహ్మనాయని చరిత్రలో మహత్వపూర్ణమైన ఘట్టము! తెలుఁగుల

పరాక్రమమునకు, ధర్మదీక్షకును సహనశీలతకును నిదర్శనము. భావిచరిత్ర కొక గుణపాఠము. విశ్వమున కొక శాంతిక్షమాసమన్వితమైన సందేశము. బ్రహ్మన్నా! నీవు ధన్యుఁడవు! నీజాతివారమైన తెలుఁగులము మేమును ధన్యులము. నీవంటి యుద్ధధర్మవీరునిగన్న మా యాంధ్రజనయిత్రి ధన్య.

నాగమ్మ బంధనము లూడినవి. బ్రహ్మన్న మాటల కామె శిరము లజ్జాభారమునఁ గ్రుంగిపోయెను. మాఱు మాటాడలేదు. ఎవ్వరికినిఁ జెప్పకుండ నెచటి కేగినదో యనూహ్యము.

మఱికొంత సేపటికిఁ గేతరాజాదుల వెంటనిడుకొని నలగాముఁ డచటి కేతెంచి భయవినయసంభ్రమము లుట్టిపడ బ్రహ్మన్న పాదములపైఁ బడి యశ్రుప్రవాహముతో నాతని చరణముల నభిషేకించెను. బ్రహ్మనాయుఁ డాతని లేవనెత్తి బిగియార గౌఁగిలించుకొని శిరమును మూర్కొనెను. నలగాముఁడంత "సచివాగ్రణీ! నీవు నాకుఁ దండ్రితరువాత తండ్రియంతటివాడవు. పితృసమానుండవై నన్ను గాపాడుచున్న నీతోడ నకారణవైరమూనితిని. నీవు మంత్రివై రాజ్యభారమును వహించుచుండఁ గడుపులోని నీరు కదలకుండ నిశ్చింతగఁ గాలక్షేపము చేసితిని. ఆ రోజులు గడచినవి. విధి ప్రతికూలమైనది. అజ్ఞాన దేవత నన్నాశ్రయించినది. ఇష్టము

వచ్చినదెల్ల నాడించినది. దయాస్వభావుఁడవు, భక్తాగ్రేసరుడవు, ప్రభుభక్తిపరాయణుఁడవు, వీరాగ్రేసరుఁడవైన నిన్నునేకకష్టములపా లొనర్చితిని. బంధువులను, మిత్రులను బొట్టబెట్టుకొనిన తరువాత అపారమైన ధననష్టమును, ప్రాణనష్టమును గలిగిన తరువాత నీనాడు బుద్ధివచ్చినది. కాని, ప్రయోజన మేమి? జరుగవలసిన దేదియో జరిగిపోయినది. పశ్చాత్తాపముచే నామనసు క్రమ్మగుచున్నది. నిన్నే శరణు వేఁడి, క్షమాభిక్ష నర్థించుటకై వచ్చితిని. నేను నీవాడ"నని దీనముగఁ బ్రార్థించెను.

ఇంతలోఁ బ్రక్కనున్న కేతరా జందుకొని "మహాశయా! మీరు మంచిచెడ్డ లెఱిఁగినవారు. కార్యాకార్యనిర్ణయమున బుద్ధిశాలురు. ఇట్టి మీకు ధర్మోపదేశ మొనరించుటకు మే మెంతవారము? గడచినవన్నియుఁ దలఁపునకుఁ దెచ్చి మిమ్ము దుఃఖపెట్టుట మా యభీప్సితము కాదు. గతమును విస్మరించి దయార్ద్రహృదయుండవై శరణాగతుఁడైన నలగామునిరక్షించి మఱల నాతనిని రాజ్యమునఁ బ్రతిష్ఠితుని జేసి యథాపూర్వకముగఁ బలనాటిరాజ్యలక్ష్మి నేలుము. ఇద్దాని నర్థించుటకే వచ్చితిమి. మా యభీష్టమును మన్నింపు"డని కోరెను.

బ్రహ్మనాయుఁ డామాటలనెల్ల సావధానముగ విని కొంతవడి యాలోచించి "కేతరాజా! లెక్కకుమిక్కిలి బంధుగులను, వీరులను జంపుకొని, దుఃఖముతోఁగుమిలి పోవుచున్న యీహృదయము మఱలఁ బలనాటి రాజ్యభారవహనమున

కొప్పుకున్నది. రాజ్యపాలనమును, నైహికసుఖములను త్యజించి యే కొండలలోనో భగవానునిగూర్చి తపం బొనరించి చేసిన పాపముల నుపశమింప జేసికొనవలెననియున్నది. కావున నను రాజ్యపాలనమునకు నిర్బంధింపక మన్నింపు''డనెను.

అంత నలగామునఁ డందుకొని ''మహాత్మా! నీవులేని రాజ్యము నా కేల? రాజ్యము సుభిక్షముగ నుండఁదలంపేని, నాయందును, బలనాటి ప్రజలయందును నభిమానమున్న చో మీరు రాజ్యభారము వహింపక తప్పదు. మీ మతప్రచారమునకుఁగాని, మీ భగవద్ధ్యానమునకుఁగాని, మీ సంఘసంస్కరణకుఁగాని యెట్టి లోటును రానీయను. అమాత్యపదవియందుండియు, నాధ్యాత్మిక చింతతోఁ గాలము గడుప వీలున్నది. మీకు విధేయుఁడనై, శిష్యుడనై, యాజ్ఞానువర్తినై మెలంగెద''నని బహువిధములఁ బ్రార్థించెను.

బ్రహ్మనాయుఁడును జేయునదిలేక మంత్రిపదవి కంగీకరించెను. తరువాత నాతఁడు హతశేషులైన సైనికుల నెల్ల రావించి వారి నుచితరీతి సత్కరించి పంపివేసెను. పిమ్మట నాతఁడు మిగిలిన యాత్మీయుల వెంటబెట్టుకొని గురజాల కేగెను.

బ్రహ్మనాయుఁడు ప్రజారంజకముగ రాజ్యపాలన మొనరించి యమరజీవియైనాఁడు. ఈ నాటికిని బలనాటి ప్రజలు బ్రహ్మనాయని శ్రీకృష్ణుని యవతారముగ భావించి

పూజించుచున్నారు. నేఁటికిని బ్రహ్మనాయుఁడు జీవించియే యున్నాఁడనియు, అదృశ్యరూపమున నెచటనో దపమొనరించుకొనుచున్నాఁడనియు వారి విశ్వాసము. ఇప్పటికిని గారెమపూఁడియం దాతనియెడ భక్తిశ్రద్ధలఁ బ్రదర్శించుచుఁ బ్రతిసంక్రాంతికిని వీరపూజ, బ్రహ్మోత్సవము చేయుదురు. బ్రహ్మనాయుఁడింకను జీవించియున్నాడను విషయము నాధునికులు విశ్వసింపక పోవుదురుగాక! కాని, యాతని భౌతిక శరీరము నశించినను నాతని వీరగాథ తెలుఁగుల చరిత్ర యందు చిరస్థాయియై వెలుగొందు ననుటమాత్రము నిక్కము.

---



## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | PSL01 C235 | **Date** | 16/11/22 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | c8, 81 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared By** | Sruthi | **Cutting By** | Sruthi |
| **Scanned By** | Mounika | **Pages** | 89 |